

కన్నబిడ్డలకోసం తల్లిదండ్రుల తపన!
ఆబిడ్డలు పెడదారిపడితే పెద్దల ఆవేదన!
వాళ్ళకోసం మీరెందుకండీ బాధపడతారు? మనతో ప్రయాణం చేసి దార్లో దిగి పోయారు. మీరు మేరు పర్వతమండీ. మీకు ఎదురు తిరిగితే వాళ్ళే బోర్లపడతారు.
ఇంటిల్లపాదినీ ఆకర్షిస్తోన్న చిత్రం!
కృష్ణంరాజు సమర్పించు
యు.వి.సూర్యనారాయణరాజు సారధ్యంలో
గోపీకృష్ణా కంబైన్స్
మా ఇంటి మహారాజు
విజయబాపినీడు
యు. శివకుమారి
Bommo

JAGATI Rs. 2-00 May 1988

33rd Year of Publication




# మే – 1988



'యాక్సిడెంట్ ఎలా అవుతుంది?'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' – 2, కచేరి రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు – 600004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00 జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్

# నిమ్మతొనలు

ఏమిట్రా ఆ వెధవ పని.... మొక్క లకి అమృతాంజనం రాస్తున్నా వెందుకూ? - కోపంగా ప్రశ్నించాడు తండ్రి.

'రాత్రంతా మొక్కలు వర్షంలో తడి శాయి కదా? జలుబు చేయకుండా ఉండటానికి' అని సమాధానంచెప్పాడు ఐదేళ్ళ నానీ.

—జి రాము

నందిగామ

ఏమయ్యా! జడ్జీగారింటికి నిన్న నువ్వు బ్రాందీ బాటిలు పంపావుట! మరి నీకు కేసు గెలవాలని లేదా ?"

'నేనేం పిచ్చివాణ్ణనుకున్నారా ? ఆ బాటిలు మన ఎగస్పార్టీ వాళ్ళు పంపి నట్లు పంపానులే!'

—కె నాగేశ్వర్రావు

నరసరావుపేట

పిల్లలెంతమంది?' —అడిగింది అన సూయ.

'ఆపరేషన్‌కి ముందు ఇద్దరు, ఆ తరువాత ముగ్గురు' — అని చెప్పింది వకుళ.

'అదేమిటి - ఆపరేషన్‌గాని ఫైయి లయిందా ?'

'ఛ....ఛ .... ఆపరేషన్ చేయించు కున్నది నేను కాదుగా!'

—కాంతామణి

ఏలూరు-2

పూర్ణేంద్రుడు అన్నం తింటూండగా పొల మారింది. 'నాకు ఈ మధ్య ఎక్కువగా పొలమారుతోంది నన్నెవరో ప్రతి క్షణం తల్చుకుంటున్నా రను కుంటూ.... ఎవరో ఆ ఆత్మయులు మంచినీళ్ళ తాగుతూ అన్నాడు పూర్ణేం ద్రుడు.

'బహుశా అప్పులవాళ్ళు అయి ఉం టారులెండి' - పుటుక్కన అనేసింది పూర్ణేంద్రుడి భార్య సుశీల.

—రమ్యప్రియ

జగ్గయ్యపేట

పార్కుకి కుక్కలని తీసుకు రాకూడ దని తెలీదా నీకు ?' - మండి పడుతూ అడిగాడు పోలీసు.

"ఆ కుక్క నాది కాదండీ" అన్నాడు గోపీ.

"కాని అది నీ వెంట వస్తోందిగా?"

"మీరు కూడా నావెంట వస్తున్నా రుగా"

—వై వి రమణ

చీరాల

అమ్మా, భగవంతుని ఆరోగ్యం పాడవుతుందా ?- అడిగాడు ఆరేళ్ళ హరి.

'నీకెవరు చెప్పారు ?' అడిగింది తల్లి.

'బడికెళ్ళే త్రోవలో డాక్టరు జగదీష్‌గారని ఉన్నారే ఆయన్ని భగవంతుడు పిలిపించుకున్నాడని రమేష్ చెప్పాడు.'

—డి సత్యమూర్తి

వాడ్రేవుపల్లి

దేవీ నేను వస్తున్నట్లు మా ఆవిడకు చెప్పకు" - అన్నాడు పార్వతీశం.

చెప్పనండీ" - నేనెందుకు చెబుతాను ?"

'చెప్పననే మాట ఇవ్వు

'భలేవారు - మీ ఆవిడ మా ఇంటికి వస్తున్నట్టు మీ కెవరైనా చెప్పారా ?'

—ఎమ్ పార్వతి

గన్నవరం

సుబ్బారావు గారంటే ఎవరు---? అడిగాడు పోస్ట్‌మేన్.

"మా పెదనాన్నగారే--- ఎందుకు ?" - ప్రశ్నించాడు రామ్మూర్తి.

"ఆయనకి ఐదువందలు మనిఆర్డరు వచ్చింది"---

"పాపం"

'ఏం ఎందుకలా అంటున్నారు?" అర్థంకాక అడిగాడు పోస్ట్‌మేన్.

'ఈ మనిఆర్డరు కోసమే ఆయన ఎదురుచూసి, చూసి రెండునెలల క్రితం చనిపోయారు---'

—భవాని

మచిలీపట్నం

నా పేరు లక్ష్మి, మీ పేరేమిటి?- బస్ స్టాపులో కుర్రాడిని పరిచయం చేసుకుంటూ అడిగింది లక్ష్మి.

'లక్ష్మీపతి' - అని జవాబిచ్చాడు సుబ్బారావు.

— సెల్వి

నందిగామ

# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి హృదయపూర్వక నమస్కారములు. 'జ గ తి' పత్రిక చదవడం మొదలెట్టాక, ప్రతీనెల ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాను. మీ 'డైరీ' సాహితీ సాంస్కృతికవాణి అని చెప్పవచ్చు. పాతికేళ్లనాటి చిత్రం గురించి ఆసక్తి దాయకంగా ఉంటున్నది - అలాగే, వెన్నెల కెరటాలు, నిమ్మతొనలు బావుంటున్నాయి. మాలతిగారికి నమస్కారములు.

—వాసా ప్రభావతి
హైదరాబాదు-36

చందూర్ దంపతులకు : నమస్తే... మూడు రోజులు యూరప్‌లోను, ఒక వారం హైదరాబాదులో మా తమ్ముడి తోను గడిపి, డిసెంబరు ఆరుకి యిక్కడికి చేరుకున్నాను. వచ్చిన వెంటనే కొంచెం జలుబు - యిప్పుడు కుదుటపడ్డాను.... మీ ఆతిధ్యం, ఆప్యాయత ఎన్నటికీ మరువురావు.... 'జవాబులు' చదవడం హాబీ అయి పోయి, మీరు మా యింట్లో వ్యక్తిగా ప్రతివారం వచ్చేవారు. ఇన్నేళ్లకు మీ దంపతులతో గడిపే అవకాశం దొరక డం, మీ టెర్రేస్ గార్డెన్‌లోని కూర లతో మీ యింట్లో భోంచేయడం, ఎంతో అదృష్టంగా భావిస్తున్నాను.... మా ఆవిడ ప్రభ, మా అమ్మాయి ఉష మీ గురించిన కబుర్లు విని ఎంతో సంతోషించారు. మీరిద్దరూ ఒకసారి అమెరికాకు రండి. ఎందరో మిత్రులున్నారు మీ కిక్కడ.

—కిడాంబి రఘునాథ్
న్యూజెర్సీ

శ్రీ చందూర్‌గారికి నమస్కారం. మార్చినెల 'జ గ తి' డైరీ, మరుపురాని మధుర మనోజ్ఞ సన్నివేశాల సంపుటి. అరవిందుల ఆశ్రమ పవిత్ర వాతావర ణం, సహృదయులు, మూర్తీభవించిన సౌజన్య మూర్తి గోపాలరెడ్డిగారి వ్యక్తిత్వ వైశిష్ట్యం, దివంగతులైన ఈమని శంకరశాస్త్రిగారి దివ్య స్మృతి శకలాలు - దివ్యారామంలో విహరింప చేశాయి.... శ్రీమతి మాలతీ చందూర్ గారికి మహిళా మిత్రులు అజ్ఞాతంగా, అపూర్వంగా, అనన్యంగా జరిపిన సత్కారం, శ్రీమతి చందూర్‌గారి నిరా డంబర, నిష్కామ కృషికి నిదర్శనంగా ఉంది..... మూడు దశాబ్దాలకు పైగా ఉత్తమ విలువలతో పత్రికను నడిపి స్తున్న మీరు, ఎందరినో సన్నిహి తంగా చూచారు.

—జొనమద్ది హనుమచ్ఛాస్త్రి
కడప-4

# ప్రాచీన సాహితి

జలముల నగ్ని ఛత్రమున జండమయూఖుని దండ తాడనం
బుల వృష గార్ధభంబులను బొల్పగు మత్త కరీంద్రమున్ సృణిం
జెలగెడు రోగ మౌషధముచే విషముం దగు మంత్రయుక్తి ని
మ్మల దగజక్క జేయనగు మూర్ఖుని మూర్ఖత మాన్ప వచ్చునే

-భర్తృహరి



పెట్టి పోసిననాడె చుట్టాల చేరిక
  కలిమి గల్గిన నాడె కాంత వలపు
సేవ చేసిననాడె క్షితినాథు మన్నన
  వయసు గల్గిన నాడె వనిత రక్తి
విభవంబు గల నాడె వెనువెంట దిరుగుట
  వడి యున్ననాడె మా వార లనుట
పోడిమి గల నాడె పొరుగింట పోరచి
  మడిగింప గల నాడె తగవు సూటి
ఆత్మశక్తి దొలంగిన యవసరమున
దనకు నెవ్వరు గానిది తథ్య మరియ
బతిమి పో నవయవము లె పనికిరావు
రామలింగేశ రామచంద్రపురవాస

—రామలింగేశ శతకం

కురువృద్ధుల్ గురువృద్ధ బాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధరుడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీల వధియించి తద్వపుల వక్షశ్శైల రక్తౌఘని
ర్ఝరముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

—నన్నయ 'భారతం'

# ప్రతి కేళనాటి పిక్చర్

## అనురూపావారి 'అనురాగం'

అనురాగం అనగానే, ఎవరికి ఎవరి మీదగల ప్రేమభావమూ అన్న ప్రశ్న జనించడం సహజం. రానురాను తెలుగు చిత్రాలకు పేర్లు కరువై దీనికి అనురాగం అను పేరు అంటించారా అనిపిస్తుంది. పిల్లలు కలగని ఒకస్త్రీ, తన సవతికి కలిగిన పిల్లవానిపై, ఆ బాలుడు వయసుకి మించిన మాటలతో తనని తూలనాడుతున్నా, అతనిపై వర్షధారలా కురిపించే మాతృప్రేమ ఈ చిత్రానికి ఆలంబనం.... రఘు (గుమ్మడి), తన మామగారి గిల్టునగల మోసంలో, భార్యకుకూడా భాగం వుందని జానకిని (జి వరలక్ష్మి) వెళ్ళగొట్టి, తండ్రి భుజంగం (నాగయ్య) యిష్టప్రకారం, దుర్గని (భానుమతి) పరిణయమాడుతాడు. ఈమెకి వెనుకటి కధ అంతా తెలుస్తుందిగాని, సవతితల్లి విషం పెడుతుందనే దుడుసు మాటల బాలుడు, ఒంటెద్దుబండి ప్లీడరు పాపారావుగారి (రేలంగి), మేనగోడలు ప్రసూనకి (గిరిజ) ట్యూషనులు చెప్పే వయసు వచ్చేదాకా (హరనాధ్) ఆగి, సవతి బిడ్డడు తనను ప్రేమించనందుకు మనోవైకల్యం చెంది, ఒక నూతన సమస్య తెచ్చి పెడుతుంది. అప్పుడు తండ్రీ కొడుకులు 'సోహ్రబ్ అండ్ రుస్తుమ్' లా హక్కుల పోరాటానికి దిగడంతో, కధావశిష్టురాలైన మొదటి భార్య కనులు మూస్తుంది; దుర్గామాత ప్రేమ ఫలిస్తుంది. హరి (హరనాథ్) చిట్టి (వాసంతి) ఒకజంట. బాలరాజు (చలం) ప్రసూన (గిరిజ) మరొక జంట. సర్వేజనా సుఖినోభవంతు.... కధ తగు పటిష్ట వంతంగా లేకపోయినా, పాటలలోని పదసాహిత్య గానమాధుర్యాలు, సన్నివేశాలు లోని కారుణ్యమూ, కమనీయత, రసౌచాతీ మిమ్మల్ని కుర్చీకి కుట్టివేస్తాయి. ఇక, భానుమతి నిరుపమాన మాతృమూర్తిగా అపూర్వ నటీమణిగా ప్రేక్షకులను మెప్పిస్తుంది. ఆమె కేంద్రకమై, మిగతా పాత్రలు ఆమె చుట్టూ పరిభ్రమిస్తాయి. ఈ చిత్రానికి దర్శకులు: రామినీడు. జన బాహుళ్యం ఆనందించగల పిక్చరిది.

—యన్నార్ చందూర్ సమీక్ష

'జగతి' మే—1963

అసంఖ్యాక దంపతుల జీవితాలు గృహసౌభాగ్యం పేరిట, ఒకే వరవడి ననుసరించి సాగిపోతూ వుంటాయి. మెల్లగా ప్రవహిస్తూ, పంట పొలాలని తడుపుతూ, గట్ల వెంబడి వృక్ష సంతతిని పెంచుతూ పెద్ద నదిలో కలిసిపోయే పిల్ల నదులవలె ఉంటాయి. ఈ జలధారలో కలిసి పోవడమేనా, యింతేనా, అని ఆక్రోశిస్తోంది నా హృదయం. —సోమర్సెట్ మామ్

# వెన్నెల కెరటాలు

## మదర్ థెరిసా

సోవియట్ యూనియన్ శాంతి కమిటీ మదర్ తెరెసాకు ఆమె 77వ జన్మదినోత్సవం సందర్భంగా యోధురాలు' అనే పతకాన్ని బహూకరించింది. ఆమె సోవియట్ యూనియన్ లో పర్యటించడం యిదే మొదటిసారి. ఆమె ఎంతో కాలంగా సోవియట్ యూనియన్‌ను సందర్శించాలని ఎదురు చూస్తున్నారు. బీదవారు లేని, నిరాశ్రయులు లేని, నిరక్షరాస్యులు లేని, క్షుద్బాధ లేని ఆదేశాన్ని చూడాలని ఆమె ఎంతో కాలంగా భావిస్తున్నారు. 77 దేశాల్లోని 370 దాతృత్వ సంస్థల్లో అనుచరులు వున్న మదర్ తెరెసా మానవ సమాజం నైతికంగాను, భౌతికంగానూ ఎన్నో యిబ్బందులు ఎదుర్కొంటూందనీ ప్రపంచంలో సహాయం అవసరమైన వంటరివారు, దీర్ఘ రోగులు ఎంతో మంది వున్నారన్నారు. "సోవియట్ యూనియన్‌లో నేను చాలామంది వృద్ధుల్ని, అనారోగ్యంగా వున్నవారిని చూసాను. కానీ వీరెవ్వరూ అసంతృప్తిగా లేరు" అన్నారు ఆమె.

—వ్యాసభాగం 'సోవియట్ భూమి'

## కుంకుడు

కుంకుడును ఇంగ్లీష్‌లో 'సోప్‌నట్' అంటారు. దీని శాస్త్రీయ నామం శాపిండస్ లారిఫోలియస్, శాపిండస్ ఎమార్జినేటస్. ఈ రెండు రకాలూ మన రాష్ట్రంలో ఉన్నాయి. మన రాష్ట్రంలో శాపిండస్ ఎమార్జినేటస్ అనేరకం ఎక్కువగా పెరుగుతూంది. దీని ఆకులు ఉపాంత రహిత అగ్రాలు. కొన తేలివుండవు. కాయలు సన్నరకం. కాయల మీద ఎక్కువగా ముడతలుంటాయి. గుజ్జు పలుచన, జిగురు తక్కువ. విత్తనం చిన్నది. కిలోకు సగటున 650 కాయలుంటాయి. ఈకుంకుడు కాయలు సగటున ఒకటిన్నర గ్రాముల బరువుంటాయి. అందులో విత్తనం సగటున 0.5 గ్రాముల బరువుంటుంది. ఒక కిలోకు రెండు వేల గింజలు తూగుతాయి..... కుంకుడు చెట్లు నూరేండ్లదాకా పంటనిస్తాయి. కాబట్టి మంచి జాతి చెట్లనుంచి విత్తనం సేకరించి, నమ్మకమైన వారినుంచి కొని గానీ, చెట్లను నాటుకోవాలి. మంచి కుంకుడు చెట్లు గొడుగు ఆకారంలో ఉండాలి. ప్రతి ఏడూ విడువకుండా కాపుకాసేదిగా వుండాలి. ఎక్కువ కాయలు, పెద్దసైజు లావుపాటి కాయలు కాసేవిగా వుండాలి. ఇటువంటి లక్షణాలున్న చెట్లనుంచి కాయల్ని, గింజల్ని సేకరించి నారు పోసుకోవాలి. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయంవారు కుంకుడు అంట్లను తయారు చేసి అమ్ముతున్నారు. అంట్లు నాటదల్చినవారు ఆయా వ్యవసాయ విశ్వ

విద్యాలయాలవారికి రాసి అంట్లను తెప్పించుకోవచ్చు.

—డా॥ రంగప్ప
'అన్నదాత'లో

## చెరుకువాడ

"కృష్ణాపత్రిక" ద ర్బా రు లో ముట్నూరివారితో, కాటూరివారితో కలసి చేయు సంభాషణలు చమత్కార ముగా, ఉల్లాసజనకముగా ఉండేవి. "కృష్ణాపత్రిక" సంక్రాంతి సంచికలో రాజకీయ పంచాంగము వికట సిద్ధాంతి పేర వెలుపడేది. ఆనాటి రాజకీయ వాతావరణంలో ఆటూ, పోటూ రాజ కీయ పర్వాలు, పార్టీల వర్షపాతాలు, నాయకులచిత్రవిచిత్ర కందాయఫలాలు, ప్రతిపక్షాల సూర్యచంద్ర గ్రహణాల పట్టు, ఎడుపు, మధ్యకాలములు, అస్త మానాలు మొదలగునవి కడుపుబ్బ నవ్వించు రాజకీయపంచాంగకర్త వికట విచిత్ర జ్యోతిష్కుడు మన చెరుకువాడ. "కృష్ణాపత్రిక" ఉప సంపాదకులుగా, గ్రంథకర్తగా, గ్రంథముల పీఠిక కర్తగా, విమర్శకులుగా ప్రతిభ గాంచిన ప్రజ్ఞాశాలి.

—జి రాఘవశర్మ
'గాంధీక్షేత్రంలో'

డిసెంబరులో రోజాలనీ జూన్‌లో హిమాన్నీ, గాలిలో నిలకడనీ, పొట్టులో ధాన్యాన్నీ, నెరజాణ నవ్వునీ యిలాటి వేవైనా నమ్మ వచ్చుగాని విమర్శ కులని మాత్రం విశ్వసించకూడదు.

—బైరన్

మానవ ప్రగతి

## రోదసి నుంచి

భూగర్భ అన్వేషణను, భూమి మీదనుంచి సాంప్రదాయిక పద్ధతులలో నిర్వహించడంకన్న రోదసి సాంకేతిక పరిజ్ఞానం ద్వారా జరపడం ఎంతో చౌక అని స్పష్టంగా రుజువైంది. రోదసినుంచి తీసిన ఛాయా చిత్రాల ఆధారంగా రూపొందించిన పటాలను వినియోగించి వ్యవసాయ సౌకర్యాలను ఏర్పాటు చేయడానికీ జరిపే ఫీల్డ్ సర్వేలకు ఖర్చు చాలా తక్కువ అవుతుందని కూడా ఆచరణలో తేలింది. 1984 లో రాకేష్‌శర్మ సోవియట్ అంతరిక్ష నౌక సాల్యూట్-7 లో సోవియట్ వ్యోమగాములతో రోదసి యాత్ర జరిపినప్పుడు భారతదేశ ప్రకృతి వనరుల కోసం ఎన్నో ప్రయోగాలను నిర్వహించారు. ఆయన నిర్వహించిన టెర్రా ప్రయోగం గొప్ప విజయం సాధించింది. తనకు భారత రోదసి పరిశోధన సంస్థ (ఐ ఎస్ ఆర్) అప్పగించిన కర్తవ్యాలన్నింటినీ ఆయన విజయవంతంగా నిర్వర్తించారు. రాకేష్‌శర్మ రోదసి యాత్ర సమయంలో రోదసి నౌకనుంచి 4800 ఛాయాచిత్రాలను తీయడం జరిగింది. ఇవి భారత భూభాగంలో 50 శాతం మేరకు పరివ్యాప్తమయ్యాయి. ఈ ఛాయా చిత్రాల ఆధారంగా భారతదేశ వివిధ ప్రాంతాల్లోని వనరులను తెలిపే పటాలను తయారు చేశారు. వీటిలో కర్నాటక, గుజరాత్ రాష్ట్రాలు, ఒరిస్సా, తమిళనాడు తీర ప్రాంతాలు, పశ్చిమతీరం, కాంబే సింధూశాఖ, చిల్కాసరస్సు, గంగానది పరివాహక ప్రాంతం మొదలైనవి వున్నాయి. టెర్రా ప్రయోగం మూలంగా, కర్నాటక రాష్ట్రంలో కలపను తెలియజేసే అవసరమైన పటాన్ని రూపొందించడానికి వీలైంది. ఈదశాబంలో తీరప్రాంతాల్లో నదుల వెంబడే వున్న అటవీ ప్రాంతాలు తగ్గిపోయాయని వెల్లడైంది. రోదసినుంచి లభ్యమైన సమాచారం ఆధారంగా భారత దేశంలోని కొన్ని ప్రాంతాల భూపటాలను కూర్పుచేయడానికి వీలైంది. వ్యవసాయాభివృద్ధికి యిది అత్యంత ప్రాధాన్యంగల విషయం. రోదసి నుంచి తీసే ఛాయాచిత్రాలవల్ల మరొక ఉపయోగమేమంటే నీటి ద్వారా కొన్ని ప్రత్యేక లక్షణాలను, భౌగోళిక

నిర్మాణ స్వరూపాలను కనిపెట్టడానికి వీలవుతుంది. ఈ చిత్రాలను విశ్లేషించి భారతశాస్త్రవేత్తలు గుజరాత్ రాష్ట్రం లోని చమురు, సహజవాయువు పటాన్ని రూపొందించారు. జంతుశాస్త్ర నిపుణులకు, ప్రకృతిశాస్త్ర నిపుణులకు కూడా యీ ఛాయాచిత్రాలనుంచి ఎంతో ముఖ్యమైన సమాచారం లభ్యమైంది. సువిశాలమైన జూలాజికల్ పార్కులలో అరుదైన జంతువుల జీవనపరిస్థితులను అంచనా వేయడానికి వీలైంది. తీరప్రాంత జలాల కాలుష్యం, వీటికాలుష్యానికి సంబంధించి యీ కాలుష్యం ఏ మేరకు వ్యాపిస్తున్నదో కూడా అంచనా వేయడానికి వీలైంది.

## హాలీవుడ్

జగద్విఖ్యాతి గాంచిన 'హాలీవుడ్' చలనచిత్ర పరిశ్రమకిది శతవార్షిక సంవత్సరం. కొత్తగా పునరుద్ధరించిన హాలీవుడ్ రూజ్‌వెల్ట్ హొటల్‌లో హాలీవుడ్ నూరవ పుట్టినరోజు వేడుకలు ఆనందోత్సాహాలతో జరిగాయి. ఈ హొటల్‌లోనే ప్రతిష్ఠాత్మకమైన అకాడమి అవార్డులను తొలిసారిగా 1929లో అందజేశారు. వందేళ్లక్రితం, 1887 ఫిబ్రవరి ఒకటిన 'రియల్ ఎస్టేట్' వ్యాపారి హార్వే విల్‌కాక్స్ తన 'రాంచ్' ని కౌంటీ రికార్డర్‌లో నమోదు చేశాడు. దానికి అతని భార్య 'హాలీవుడ్' అని పేరు పెట్టింది. తన నేస్తం ఒకరికిగల 'వేసవి విడిదిగృహం' పేరునే(హాలీవుడ్) ఆమెతను 'రాంచ్'కి కూడా పెట్టుకున్నారు. 1903లో హాలీవుడ్ ఒక నగరంగా మారింది. కాని 1910లో అది లాస్ ఏంజిలిస్‌లో భాగమైపోయింది. అమెరికాలో చలన చిత్ర నిర్మాణం తూర్పుకోస్తా ప్రాంతంలో ప్రారంభమైనప్పటికీ 1940 నాటికి అది దక్షిణ కాలిఫోర్నియాకి, ప్రత్యేకించి హాలీవుడ్‌కి విస్తరించి అక్కడే బాగా స్థిరపడింది. 1920 దశకం నాటికి హాలీవుడ్ ప్రపంచ చలనచిత్ర పరిశ్రమకు ప్రధాన కేంద్రమయింది. వెచ్చనివాతావరణంలో చక్కని సూర్యరశ్మితో – ఔట్‌డోర్ షూటింగులకు దేశంలోని పెక్కు ఇతర ప్రాంతాలకంటె ఎక్కువ అవకాశాలు కలిగి వుండడంతో చిత్రనిర్మాతలు హాలీవుడ్ పట్ల ఆకర్షితులయ్యారు భౌగోళికంగా ఆప్రాంతంలోనివైవిధ్యం కూడాదీనికి బాగా దోహదం చేసింది. సమీపంలోని, సముద్రతీరం, ఎడారి, కొండలు - చిత్రీకరణకు అవసరమైన చక్కని 'లొకేషన్లను సమకూర్చాయి. హాలీవుడ్ శతవార్షికోత్సవాన్ని పురస్కరించుకుని ఒక 'కాలనాళిక' (టైమ్ కాప్స్యూల్) ఈ 'కాలనాళిక' లో బాబ్ హాప్, జిమ్మి స్టెవర్ట్, జీన్ ఆట్రీ జ్ఞాపికల నుంచారు. అమెరికా అధ్యక్షుడు రేగన్ కూడా ఈ 'కాలనాళిక' కోసం ఒక లేఖ పంపారు. 'నగరాలన్నిటితో పోల్చితే హాలీవుడ్ చిన్నదే. అది 14 1/2 చదరపు మైళ్లవిస్తీర్ణంతో, 200,000 జనాభా మాత్రమే కలిగివుంది. అయితే దాని ప్రపంచ ప్రఖ్యాతి మాత్రం భూమిపైన గల పెక్కు ఇతర దేశాలతోనే పోటీ

పడుతుంది' అని రేగన్ తమ లేఖలో పేర్కొన్నారు. 'మోషన్ పిక్చర్ అకాడమి సౌజన్యంతో హాలీవుడ్ శతవార్షిక సంఘం అయిదడుగుల 'కాలనాళిక' లో ఒక 'ఆస్కార్'ను కూడా వుంచగలిగింది. 'వింగ్స్' అనే 1927 నాటి తన చలనచిత్రం వీడియో క్యాసెట్‌ను బడ్డీ రోజర్స్ 'ఈకాలనాళిక' లో వుంచారు. 'వింగ్స్' చిత్రానికి అకాడమి నుంచి మొట్టమొదటి ఉత్తమ చిత్రం బహుమతి లభించింది. ఈ కాలనాళికను ఎక్కడ నెలకొల్పాలనే విషయంపై నిర్ణయం గైకొనే ముందు దీనిని దేశవ్యాప్తంగా అన్ని ప్రాంతాల లో 'పర్యటనకు' పంపుతారు.

## టూరిజమ్

వినోద పర్యాటకులను విశేషంగా ఆకర్షించేందుకై ఇండియా కోటి డాలర్ల (సుమారు 13 కోట్ల రూపాయల) వ్యయంతో ప్రపంచ వ్యాప్తంగా ఒక భారీ ప్రచార కార్యక్రమాన్ని చేపట్టింది. కాగా, ఇందులో నాలుగవ వంతు మొత్తాన్ని అమెరికాలో వార్తాపత్రికలు, రేడియో, టెలివిజన్ ద్వారా ప్రచారం నిర్వహించడానికి ఖర్చు చేస్తారు. ఇండియాను సందర్శించే అమెరికన్ పర్యాటకుల సంఖ్య 1985-86 మధ్య కాలంలో 30 శాతానికి పైగా పెరిగింది. ఇంకా ఎక్కువ సంఖ్యలో అమెరికా నుంచి వినోద పర్యాటకులను ఇండియాకు ఆకర్షించ వచ్చునని భారత ప్రభుత్వం భావిస్తున్నది. ఇలా వుండగా అమెరికాలో ప్రచార కార్యక్రమానికై ఇండియా ఖర్చు పెడుతున్న మొత్తం హెచ్చుస్థాయిలో వున్నదని, దీనివల్ల ఇండియా ఇప్పటి వరకు ఇతర దేశాలలో చేపట్టిన ఇట్టి ప్రచారాలన్నిటిలోకి అతి భారీ కార్యక్రమం అమెరికాలోనే జరుగుతున్నట్టవుతున్నదని భారత టూరిజం విభాగం అధికారులు తెలిపారు. అమెరికాలో ఖర్చు పెట్టనున్న కోటిడాలర్ల మొత్తంలో సుమారు 13 లక్షల డాలర్ల ప్రముఖ వార్తా పత్రికలలో వాణిజ్యప్రకటనలు (అడ్వర్టయిజ్‌మెంట్లు) ఇవ్వడానికి ఖర్చు పెడతారు. రేడియోలో 30 సెకండ్లు, జాతీయ టెలివిజన్ కార్యక్రమాలలో 60 సెకండ్లు వంతున వాణిజ్య ప్రకటనలు ప్రచారం చేయడానికి 4 లక్షల డాలర్లు వెచ్చిస్తారు.

## మిథున్

మానవుడు ఆవిర్భవించక ముందు వన్యప్రాణులు నిర్భయంగా, నిరాటంకంగా ప్రకృతి ఒడిలో సేదదీర్చుకొంటూ, స్వేచ్ఛగా విహరించేవి. ప్రస్తుత కాలంలో ఈ ప్రాణులకు నిలువ నీడ లేకుండా చేస్తున్నాడు మానవుడు. అలా బలైపోతున్న జీవులలో 'మిథున్' ఒకటి. మిథున్, ఆవు లేక ఎద్దును, పోలి ఉంటుంది. ఈ జంతువులు ముఖ్యంగా ఈశాన్య భారత దేశము, వాయవ్య బర్మా, బంగ్లాదేశ్‌లలో దట్టమైన అడవులలో కనిపిస్తాయి. 'అరకాన్ యొమ', అనే ఘీకారణ్యంలో ఇవి విరివిగా కనిపిస్తాయి. కొందరు ఈ జంతువును

ఆండీస్‌లోని 'లామ' తోను మరి కొందరు టిబెట్‌లోని 'యాక్' తోను పోలుస్తారు. సుమారు 6 అడుగుల ఎత్తుతో 500 కి.గ్రా. బరువు దాకా ఉంటుంది. రొమ్ము క్రింద భాగాన చర్మము పొడుగ్గా క్రిందికి వ్రేలాడుతూ ఉంటుంది. భయాన్ని కల్పించే కొమ్ములు సుమారు 30 సెం.మీ పొడవు వరకూ ఉంటాయి. కొమ్ములు అడుగు భాగం వైపు పసుపు వర్ణంతో ఉంటాయి. కొమ్ములు లోపలి వైపుకు వంకర తిరిగి ఉంటాయి. దీని పుట్టుక గురించి అనేక రకాల వదంతులు ఉన్నాయి. కొందరేమో ప్రథమంగా ఆవిర్భవించిన మిథున్‌లు టిబెటన్ యాక్‌కి, అడవి ఆవుకి కలిగిన సంతానమని నమ్ముతారు. భారత దేశంలో సుమారు 1,06,000 మిథున్‌లు ఈశాన్య ప్రాంతంలో ఉన్నాయి. వీటిలో చాలా జంతువులు మచ్చిక కాబడుతున్నప్పటికీ కొన్ని మాత్రం ఇంకా వన్యంగానే జీవిస్తున్నాయి. ఇవి గుంపులు గుంపులుగా సంచరించడానికి ఇష్టపడతాయి. చల్లని వాతావరణంలో సుమారు 2000 అడుగుల ఎత్తు ప్రాంతాలలో ఇవి ఎక్కువగా సంచరిస్తాయి. ఇవి శాకాహారులు. తిండికోసం నివాస స్థలాల నుండి 5 నుండి 10 కి.మీ దూరం దాకా వెళ్తాయి. గడ్డిని, చెట్ల ఆకులను ఆహారంగా తీసుకుంటాయి. చూడటానికి అందంగా కనిపిస్తుంది మిథున్. ఇది వేగంగా కదలగలదు. తగినంత చాకచక్యం కూడా ప్రదర్శిస్తుంది. దేహం భారీగా, దృఢంగా ఉంటుంది. అప్పుడే పుట్టిన మిథున్ దూడ పసుపు గోధుమ రంగు కలిగి సుమారు 30 కి. గ్రా. తూగగలదు. నాలుగు నెలల అనంతరం ఇది సహజ వర్ణాన్ని సంతరించుకొంటుంది. ఈ దశలోనే క్రొమ్ములు కూడా పెరగడం ప్రారంభిస్తాయి. సుమారు నాలుగేండ్ల ప్రాయంలో ఈ మిథున్‌లు పరిపక్వతను సంతరించుకొంటాయి. మిథున్ ఆవు ప్రతి సంవత్సర ఒక దూడను ఈనుతుంది - ముప్ఫయ్యేళ్ల పాటు! ఈశాన్య ప్రాంతాలలో చాలా చోట్ల మిథున్ - పాలనుపయోగిస్తున్నారు. పాలు చిక్కగా, క్రొవ్వు పదార్థాలను ఎక్కువగా కలిగి ఉంటాయి. ఒకొక్క మిథున్ ఖరీదు రూ. 5000 దాకా ఉంటుంది. ఈ మిథున్‌ను హోదాకు చిహ్నంగా గుర్తిస్తారు.

మానవత్వ మెప్పుడూ హృదయంలోని మెత్తదనంలా వ్యక్తమవుతుంది.

* * *

అహింస పూర్తిగా అనుసరణీయమైనప్పుడు, ద్వేషం దానం తనంతటదే మాయమవుతుంది.

* *

ఆకలితో అలమటించేవానికి దేవుడు అన్నమై కనిపిస్తాడు - అందుకే 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అన్నారు.

— గాంధీజీ

# కొత్త పుస్తకాలు

జలఖడ్గం - కవితలు. రచన: విజయసారథి. ప్రచురణ: సాహితీ స్రవంతి, ఖర్గపూర్.... వెల రు 2-00.

'ఆకలి కొలిమిలో కాలే ఇనుప ముక్క' ఈ జీవితమనీ, 'పళ్లచక్రాల మధ్య నలిగిపోతున్న - చెరుగ్గడ మనిషి' అనీ, 'కవిత్వం కాగితాల్లో కాదు - ప్రవహించాల్సింది జనంలో' ననీ, 'తమస్సుని చీల్చే తపస్సు విప్లవ' మనీ 'నెత్తుటి కాలువల్లో - 'ప్రవహించే కాగితం పడవల్లా' వార్తా పత్రికలున్నాయనీ, 'క్యాపెటస్టుల ప్రయోగాల్లో- కెటలిస్టులు కార్మికుల'నీ ఆవేదన చెందుతున్నారు ఈ కవి. 'మనిషిని ఆలోచించే జంతువు అన్నారు - నేను కన్నీరు కార్చే జంతువు అంటున్నాను' అని సూక్తి పలికే శేషేంద్ర, విజయసారధికి గురుతుల్యులు.

* * *

లెనిన్ కథ - పిల్లలకు. రచన: ఎన్. మంగాదేవి. ప్రచురణ: మైత్రీ క్లబ్, శ్రీ వెంకటేశ్వర బాల కుటీర్, శ్యామలానగర్, గుంటూరు - 6.... వెల: రు 6-00.

కాకుమాను గ్రామంలో కొండపల్లి బొమ్మల్లా బారులు తీరి నిలబడిన పిల్లల్లోని పన్నెండేళ్ల సుజాతకు, నవంబరు పద్నాలుగున, అంటే నెహ్రూ పుట్టిన రోజున, సోవియట్ లాండ్ నిర్వహించిన చిత్రలేఖన పోటీలో అవార్డు వచ్చినట్టుగా ప్రకటిస్తారు హెడ్‌మాస్టారు. ఏరోడ్రోమ్ అనేది ఎప్పుడూ చూసివుండని ఆ పన్నెండేళ్ల కాకుమాను పంచాయతీ బాలికకు నల్ల సముద్ర తీరంలోని 'ఆర్టెక్'లో ఒక నెల్లాళ్లపాటు తన వయసు పిల్లలతో గడపగలగడమనే అదృష్టం లభిస్తుంది.

అన్న రమేష్ సుజాతని కామ్రేడ్ అంటూ ఆటలు పట్టిస్తాడు. తమ్ముడు సుధీర్‌కి, ఎర్ర జండా మామయ్య లెనిన్ కథ చెబుతున్నప్పుడు, ఆ లెనిన్‌లో టార్జానూ, 'గూఢచారి 116' లోని కృష్ణా కనిపించడం సుజాతకి చిరాకుగా ఉంటుంది. కాని, ఎర్ర జండా మామయ్య సుధీర్‌లోని సహజోత్సాహాన్ని మన్నిస్తూ, మందలిస్తూ, లెనిన్ జీవితాన్ని పిల్లలకి, పెద్దలకి అర్థమయేటట్లు స్పందనతో, ఆ పిల్లలు ముగ్గురిలో కలిగిన ఆత్రం వంటిదే పాఠకునిలో కలిగేటట్టు చెబుతాడు.

'లెనిన్ ది లవ్ మారేజా ?' అని ఉషారుగా అడుగుతాడు రమేష్. 'డ్యూయేట్లు పాడుకుంటూ పార్కుల్లో తిరిగే లవ్ కాదది' అని చెబుతాడు, పదిహేను రోజుల పాటు స్నేహబృంద సభ్యునిగా

సోవియట్ రష్యాలో పర్యటించిన ఎర్ర జండా మామయ్య.

" వ్లదీమిర్ ఇల్యీ విచఉల్యానోవ్‌ని 'వలోద్య' అని పిలిచేవారు చిన్నప్పుడు. సైబీరియాలో 'లేన్' అనే నది ఉంది. అక్కడ ప్రవాసంలో ఉన్నప్పుడు 'లెనిన్' అనే కలంపేరు పెట్టుకున్నాడు వలోద్య. అదే ఆయన 'స్థిర నామం' అయింది. లెనిన్ గురించి, గాంధీగారి గురించి ఎంత చెప్పుకున్నా తరగదు. రచయిత్రి మంగాదేవి, పిల్లల మనో భావాలకనుగుణంగా, చక్కటి శైలిలో, హృదయానికి హత్తుకొనే విధంగా, ఎర్ర జండా మామయ్య చేత లెనిన్ కథని ఎంతో రసవత్తరంగా బాల బాలి కల కోసం చెప్పించారు.

రచయితా - శిల్పమూ, రచన : ఇల్యా ఎహ్రెన్ బర్గ్: తెలుగు అను వాదం: తుమ్మల వెంకటరామయ్య ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుజ్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001 వెల: రు 4-00.

'ఫ్రాన్సులో నేడు బాల్జాక్, స్టెండాల్, హ్యూంగో, ఫ్లాబర్ట్, జోలా వంటి వారుగాని, ఇంగ్లండుతో డికెన్స్, బైరన్, షెల్లీలుగాని వేరు. ఒక స్టెండాల్‌గాని, ఒక డికెన్సుగాని జన్మించాలంటే దేశకాల పరిస్థితులు హేతుభూతమవుతున్నాయి'-అంటారు. 'స్టారమ్' (STORM) నవలతో ప్రపంచ సాహిత్యంతో ఒక ప్రత్యేక స్థానం పొందిన ఇల్యా ఎహ్రెన్ బర్గ్ : ముప్ఫయి ముప్ఫయ్యయిదేళ్ల క్రితం మద్రాసు వచ్చారు - ఇక్కడి రచయితలను కలుసుకున్నారు - ఆ కలుసుకున్న వారిలో నేనూ ఉన్నాను.

ప్రతి రచయితకూ తనదైన ఒక స్వంత మార్గం ఉంటుంది. సృజనాత్మక రచన ప్రారంభించినప్పుడు, పాత్రలు అక్షరాలా రచయిత చెప్పినట్టువినవు- వాటి యిష్టమొచ్చినట్టు పరుగులు తీస్తూ వుంటాయి ; కంటక మార్గాలు ఎన్ను కుంటాయి ; ప్రవాహానికి ఎదురీదుతా మంటాయి; అంబర చుంబిత శిఖ రాలు అధిరోహిస్తా మంటాయి. రచ యిత, కొంతదూరం వాటి వెంట పయనించి, మచ్చిక మాటలతో నేర్పుగా తన మార్గంలోకి రప్పించు కుంటాడు - అదే శిల్పం, అదే శైలి.

ఎంత గొప్ప రచయితకైనా కొన్ని అడ్డ గోడలుంటాయి ; పరిమితులూ, ఇష్టానిష్టాలు, అభిరుచులూ ఉంటాయి. తర్క వితర్కాల మాట ఎటున్నా రచయిత గుర్తుంచుకోవలసినవి, రెండే రెండు అంశాలు. ఒకటి : తనకు ఆసక్తి కాని విరాయకపోవటం; రెండు:రాయా లనే కోరిక ఉన్నా, రాయకుండా వుండ లేని అంతర్గతమైన ఒత్తిడి ఉక్కిరి బిక్కిరి చేసేదాకా కలం చేబట్టక పోవడం - ఆ 'హృదయ' ధర్మాన్ని రచయిత విస్మరించ కూడదని హెచ్చరిస్తారు ఇల్యా ఎహ్రెన్ బర్గ్.

—క్షీరసాగరమ్

# డైరీ

1988 జనవరి 27

'రిపబ్లిక్ డే' నాడు, అంటే నిన్న చార్మినార్‌లో బయలుదేరి ఉదయం పదిన్నరకి నాంపల్లి చేరాము. ఈసారి నారాయణగూడా టాజ్ మేనేజరు నగరాజారావు మేము అక్కడున్న మూడు రోజులూ మాగురించి ఎంతో శ్రద్ధగా కనుకున్నారు - ఫస్ట్ ఫ్లోర్ లోని 23వ నెంబరు రూమ్ ఇచ్చారు - 'ఏ హోమ్ యవే ఫ్రమ్ హోమ్' అనే సామెతకు సరిపడట్టుగా, ఏసితో చిన్న బాల్కనీతో ఎంతో సౌకర్యంగా ఉంది. 'హోటల్లాలేదు, మనయింట్లో ఉన్నట్టు వుంది' - అని చాలా హోమ్లీగా ఫీల యింది మాలతి.... పన్నెండు గంటలకి ఫోన్ చేయగా, డిటెక్టివ్ ఇనస్పెక్టర్ ఫడ్కే, వెంటనే కోర్టుకి వెళ్దామన్నారు. పోలీసు వుద్యోగులు వారి జీపులోరాగా, ఫడ్కే మాతో మాకారులో ఉన్నారు. అయిదవ మెట్రోపాలిటన్ మేజస్ట్రేట్ కస్టడీలో ఉన్నాయి - అపరాధి వద్ద నుంచి పోలీసువారు స్వాధీనం చేసు కున్న మా నగలు. (1987 మార్చి 30వ తేదీన జరిగిన మాలతీచందూర్ నగల చోరీ పాఠకులకు తెలిసినదే) స్ట్రాంగ్ రూమ్ నుంచి వస్తువులు తెప్పించడం, అవిమాకు వొప్పగించడం అనే ఈ ప్రొసీజర్ గంటా గంటన్నరలో ముగిసింది. ఈ సందర్భంగా గౌ॥ దామోదరం గారికీ, ఇనస్పెక్టర్ ఫడ్కే గారికీ మా హృదయపూర్వక కృతజ్ఞ తాభివందనలు. నేరం జరిగిన రోజున రెండు నిముషాలపాటు ఇహపరాల సరిహద్దు రేఖపై తచ్చాడినప్పటికీ, ఈ లోకంలో ఎంత మంచితనమూ, ఎంత సౌహార్ద్రత ఉన్నదో మాయిద్దరికీ స్వానుభవంతో తెలిసింది. (మూడు జతల బంగారు గాజులు బాపాలాల్ ముద్రతో, నిందితుడు రెండు బంగారు గొలుసులూ కరిగించగా కొంచెం తక్కువగా లభించిన 38.5 గ్రాముల మేలిమి బంగారం, పోయిన పధ్నాలుగు వందల నగదులో పన్నెండు వందలూ మాకు యిచ్చారు). ........మాలతిని నల్లకుంట లోని వాళ్ల అక్కగారింట్లో దించి, చిక్కడపల్లి - త్యాగరాయ గాన సభకుతీసుకువెళ్లారు వాసిరెడ్డి సీతాదేవి. వంశీ 'ఆర్ట్ థియేటర్స్'వారి సాంస్కృతిక కార్యక్రమం, వరంగల్లుకి చెందిన రవీందర్, సునీత, రజితల జానపద నృత్యంలో ఉదయామణ కాంతులు వెల్లివిరిశాయి. ........నారాయణరెడ్డి

అధ్యక్షతను, రామానుజ రామాయణం అయోధ్యకాండ - పూర్వభాగం ఆవిష్కరణ. రామకథామృతాన్ని ఎందరు ఎన్నిసార్లు తడవలు పంచి పెట్టినా, మధురాతి మధురంగానే ఉంటుంది. ఉషశ్రీ, కవి పరిచయం చేయగా, న్యాయమూర్తి కోదండరామయ్య ఆవిష్కరణ గావించారు. చివరి దాకా కూచోవాలని మనసులో పీకుతున్నప్పటికీ, తప్పనిసరిగా మధ్యలో వచ్చేయవలసివచ్చింది. మర్నాటి ప్రెస్‌మీట్‌కి, మిత్రులు వంశీ రామరాజు తగు ఏర్పాటు చేస్తానన్నారు.... ప్రెస్‌మీట్ ఎందుకంటే, మాకష్టంలో మమ్మల్ని ఎంతగానో ఆదుకున్న పత్రికల వారికి కృతజ్ఞత వెల్లడించి, 'మానగలు మాకుదొరికాయి - అని తెలిపేందుకు !

. . . . . 28

నిన్న కోర్టునుంచి రాగానే హనుమంతరెడ్డిగారి రూమ్‌లోకి వెళ్లి, వారికి కృతజ్ఞత తెలిపాం - 'టీ' తీసుకు వెళ్లండి - అన్నారు ఎంతో ఆదరంతో. ఎన్నటికీ మర్చిపోలేని స్నేహానుభూతులవి.... ఫడ్కేగారి అమ్మాయిలు - అనఘ, అనిత - యిద్దరూ చక్కటి నాట్యకళాకారిణులు - సుమతీ కౌశల్ శిష్యులు 'నృత్యశిఖర' వారి 91వ, 92వ అరంగేట్రమ్స్ (రంగ ప్రవేశం) అనఘ, అనితలవి. 1987 అక్టోబరు 12వ తేదిన, అప్పటి ఛీఫ్ జస్టిస్ భాస్కరన్ అధ్యక్షతని, 'రవీంద్ర భారతి' లో ఆ ఫంక్షన్ జరిగింది - 'లలితకళలు మానవ స్వభావంలోని మృదుత్వాన్ని పెంచుతూ, రసానుభూతి తలిగిస్తాయి. ముఖ్యంగా విద్యార్థినులు ఈ లలిత కళల పట్ల ఆసక్తి చూపడం ఎంతో ముదావహం' - అన్నారు 'డైరక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్' పి యస్ రామ్మోహనరావుగారు - అనఘ, అనితల రంగప్రవేశ సందర్భంగా యిచ్చిన సందేశంలో. . . . అంచేత, ఈ ఉదయం మొట్టమొదటి విజిట్ వారింటికి ! పూల తీగెల మధ్య ఆ యిల్లు ఎంతో ప్రశాంతంగా ఉంది. ఫడ్కే దంపతులూవారి అమ్మాయిలూ మా యిద్దరిపట్లా ఎంతో ఆదరాభిమానాలు చూపించారు . . . ఆ తర్వాత అప్పారావు గారింటికి - శివస్వామి దంపతుల ద్వారా వారు, మాకు పరిచయం. అప్పారావుగారితో, మాట్లాడుతూవుంటే గంటలు నిముషాలవుతాయి. సంచలనాత్మకమైన ఆయన 'యానక్‌డోట్స్' మానవనైజంలోని లోతులు తెలిపే మణిపూసలు - ఎంతో ఆర్ద్రత గలవి. అవి యిక్కడ అప్రస్తుతం కళల పట్ల, పూలమొక్కల పట్ల ఎంత అభిమానమో వారి డ్రాయింగ్ రూమూ ముందున్న తోటా తెలుపుతాయి. . . . . . ఆ తర్వాత కమీషనర్ సూర్యనారాయణరావుగారిని వారి ఆఫీసులో చూశాము. ఆయన సాహిత్యాభిమాని. అయిదు నిముషాల్లో వచ్చేద్దామనుకొని, యించుమించు యిరవై నిముషాలు వుండిపోయాము. కమీషనర్‌గా ఆయన టైము ఎంతో విలువైనదని మాకు తెలుసు. అయినప్పటికీ స్వయంగా చూసి, కృతజ్ఞత

యస్.దశరథ

సమర్పించు

"ఇంద్రధనుస్సు ఇల్లాలై
ఇంటి వెలుగు అయింది"

ఎ.యస్.ఆర్ట్ మూవీస్

# ఇంద్రధనుస్సు



దర్శకత్వం కె.రంగారావు

నిర్మాత: బి.శ్రీనివాసరావు

ఆచార్య-ఆత్రేయ

యం.వి.రఘు - రాజ్-కోటి

ఇళయరాజా స్వరమాధురి

జి.బాబు సమర్పించు

లలితశ్రీ కంబైన్స్

# అభినందన

నిర్మాత ఆర్.వి.రమణమూర్తి

ఫొటోగ్రఫీ స్క్రీన్‌ప్లే దర్శకత్వం అశోక్ కుమార్

మాటలు-పాటలు ఆచార్య ఆత్రేయ





వెల్లడించటం మావిధి. . . రామకృష్ణా రావుగారు ఊళ్ళోలేరట - మాలతివారి శ్రీమతితో ఫోనులో మాట్లాడింది. . . ఇంకా మరికొందరిని చూసి హొటల్ చేరుకొనేసరికి మూడయింది. నాలుగు న్నరకి ప్రెస్‌మీట్ - ఆ భారమంతా వంశీ రామారాజుగారిది. ఆయనకు స్థానికంగా అందరూ పరిచితులు కాబట్టి మా తరపున ఆయనే పిలిచారు; కొందరిని మేము స్వయంగా పిలిచాము ఫోన్‌లో. అనుకున్నవారు వచ్చారు-ఒక అరగంటసేపు యిష్టాగోష్టి జరిగింది. క్రితంరోజు కోర్టువారి వద్దనుంచి పుచ్చుకున్న నగలూ బంగారమూ చూపింది మాలతి ; పోలీసువారు ఎటు వంటి పట్టుదలతో పనిచేసి అపరాధిని పట్టుకున్నదీ చెప్పి హైదరాబాదు ప్రెస్ మమ్మల్ని ఎంతగానో ఆదు కున్నందుకు మా మనఃపూర్వక కృతజ్ఞతాభివందనలు తెలియజేశాము . . . . . ఆ తర్వాత కృష్ణమూర్తిగారు మమ్మల్ని అరుణావ్యాస్ దంపతుల వద్దకు తీసుకువెళ్ళారు; వాసిరెడ్డి సీతాదేవి సులోచనారాణి యింటికి తీసుకువెళ్ళారు. పొద్దుట ఏడున్నరనుంచి-ప్రెస్‌మీట్ సందర్భంగా ఒక గంటన్నర తప్ప - మిగతా సమయమంతా చక్రాలమీదనే! ఆరాత్రి సీతాదేవి యింట్లో డిన్నర్- అక్టోబర్లో వచ్చినప్పుడుకూడా వారింట్లో భోంచేయలేదని మా మీద ఫిర్యాదు. మూడున్నర దశాబ్దుల మైత్రీ బంధం మాకు వారి కుటుంబంతో - ఇంకా ఎక్కువేనేమోకూడా ! మిసెస్ నారా యణరావు ఎన్నో వంటకాలు చేశారు



ఢిల్లీలో ఏ తెలుగు సమావేశం జరిగినా, ప్రముఖ పాత్ర వహిస్తూ 20 సంవత్సరాలపాటు ఢిల్లీ ఆంధ్రా ఎసోసియేషన్‌కు ప్రధాన కార్యదర్శిగా తెలుగు సంస్కృతిని, తెలుగు కళలను రాజధానీ నగరంలో వికసింపజేసిన యస్. వి. యన్ మూర్తి జనవరి 31వ తేదీని దివంగతులయారు. భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీకి ఢిల్లీ కన్వీనరుగా ఉండి, ఉత్సవాల విజ యానికి ఎంతో దోహదం చేసిన సహృదయులు.

-నారాయణరావు (సీతాదేవి బ్రదర్) కబుర్లు చెబుతున్నారు. కాని మా యిద్దరికీ కళ్ళమీదకి నిద్ర కూరుకు వస్తోంది. మా అవస్థ గమనించి, భోజన మవగానే హొటల్‌కి పంపారు. నడుంవాల్చడమేమిటి నిద్ర ముంచుకు రావడమేమిటి-ఉదయం ఆరుగంటలకి కాఫీ కప్పులతో బేరర్ - బెల్ నొక్కే దాకా విశ్రమించాము.

. . . . . 29

నిన్న కృష్ణమూర్తిగారింటికి భోజనానికి వెళ్ళలేకపోయాము. కాబట్టి యివ్వాళ బ్రేక్‌ఫాస్ట్ తప్పదు. ఏడున్నరకల్లా వచ్చాడు వారి డ్రయివరు. 'రెండు రోజులై వచ్చి యిప్పుడా మా యింటికి రావటం ?' అని నిలదీశారు. మాలతిని, మిసెస్ కృష్ణమూర్తి (హేమలత). ఒక గంటసేపు వారింట్లో గడిపి, ఆయనని వారి ఆఫీసువద్ద దించి, హొటల్‌కొచ్చాం. పదకొండున్నరకి విజయవాడ ప్రయాణం — బై రోడ్. అయితే, తెమిలి బయటపడేసరికి ఒంటి గంట అయింది.

31

నిన్న విజయవాడలో 'స్వాతి' బలరామ్‌గారినీ, క్వాలిటీ మురళీకృష్ణ గారినీ చూడటం, నూజివీడు వెళ్లి రావటం, రాత్రి పన్నెండున్నర దాకా మిత్రులతో సాహిత్య మీమాంస, పుస్తక విక్రేతల కష్టనష్టాలూ - యివన్నీ అయాక ఈ ఉదయం పదకొండు గంటలకి గుంటూరు.... వెంకటేశ్వర బాలకుటీర్ గురించి ప్రభావతి వెనకొకసారి చెప్పారు ; గుంటూరు వచ్చినప్పుడు 'మీరు మా స్కూలు తప్పకుండా చూడాలి' - అన్నారు. అయితే, నాలుగు రోజులుగా సీతాదేవి చెబుతున్న మంగాదేవి, ఈ స్కూలు నిర్వహిస్తున్న మంగాదేవి ఒక్కరేనన్న విషయం, ఆమెని చూసేదాకా నాకు తెలియలేదు. 'డాక్టరు ఆదెమ్మగారు, నేనూ రాజమండ్రినుంచి వస్తున్నప్పుడు రైలులో మిమ్మల్ని చూశాను' - అని ఆమె అన్నప్పుడు మరింత విస్మయం కలిగింది. . . .యావద్భారత స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయినిగా ఈ సంవత్సరం ఢిల్లీలో బహుమతి పొందిన ఇరవైనలుగురిలో ఈమె ఒకరు. అయిదారుగురితో ప్రారంభమైన వారి 'బాలకుటీర్' యిప్పుడు సుమారు పద్దెనిమిది వందలమందికి విద్యాదానం చేస్తోంది. వారి స్కూలు గురించీ ప్రభావతీ, మంగాదేవి సంయుక్తంగా చేస్తున్న అద్వితీయ కృషి గురించీ యిప్పుడు కాదు- మరొకసారి! మాటల సందర్భంగా మాలతి అడిగింది: 'మిమ్మల్ని ఇన్‌స్పయిర్ చేసిన పుస్తకమేదైన ఉన్నదా?' '-'అల్బర్ట్ ష్వైట్జర్ జీవితం' ,-అన్నారామె... ముప్ఫయి ముప్ఫయ్యయిదేళ్లక్రితం లండన్ నుంచి వెలువడే 'ఇల్లస్ట్రేటెడ్' అనే ఆంగ్ల వార పత్రిక, పాఠకులకి ఒక ప్రశ్న యిచ్చింది. నలుగురు ప్రపంచప్రఖ్యాత వ్యక్తులపేర్లు చెప్పి, వారిలో ఎవరివల్ల మానవాళికి ఎక్కువ 'హాపీనెస్' (సుఖసంతోషాలు) చేకూరిందని అడిగింది. తన నాటక రచనలోని నిశిత పరిశీలన, సునిశిత హాస్యంతో



అహింసా విధానమవలంబించనిదే, సత్యపథం తెలుసుకోవడం సాధ్యం కాదు. —గాంధీజీ



మేధావులని సైతం మెప్పించిన జార్జి బెర్నార్డ్‌షా; ఒంటరి బతుక్కి మంచి తనానికి ప్రతీకగా దయార్ద్ర హృదయుడై తన కన్నీటి వెలుగులతో ప్రేక్షకులని నవ్వించిన చార్లీచాప్లిన్; ఫాసిస్ట్ విజృంభణని అరికట్టి, మానవ నాగరికతని, స్వాతంత్ర్య జ్యోతిని కాపాడిన రెండవ ప్రపంచ యుద్ధ విజేత విన్‌స్టన్ చర్చిల్; హాయిగా అందరు డాక్టరులకి మల్లే ఆధునిక సదుపాయాల మధ్య జీవించక, ఆఫ్రికా ఖండంలోని ఒక మారుమూల గ్రామంలో దీనులకు వైద్యసహాయ మందించిన ఆల్బర్ట్ ష్వీట్జర్ - 'ఈ నలుగురిలో ఎవరు గొప్పవారు?' అంటే, పాఠకులలో ఎక్కువ మంది ష్వీట్జర్‌కే వోటు వేశారట. అటువంటి ష్వీట్జర్, విద్యారంగంలో కృషి చేస్తున్న మంగాదేవి జీవితాన్ని ప్రభావితం చేశారూ అంటే ఆమె సంకల్ప బలం ఎటువంటిదో మీరు ఊహించుకోవచ్చు. శ్యామలా నగర్‌లో పూల చెట్లు మధ్యనున్న వారి ఇల్లు ఒక మైత్రీ లతానికుంజం. మధ్యాహ్నభోజనం, నాలుగు గంటలకి టీ ఆనందతీర్థ అగ్రహారం, డాక్టరు యతిరాజులు గారిని చూడటం - ఆరుగంటలకి విజయవాడ తిరుగు ప్రయాణం. ప్రభ మాతో వచ్చారు కారులో మమ్మల్ని దింపేందుకు - సీతాదేవీ గుంటూరులో వుండి పోయారు... 27వ తేదీ ఉదయం హైదరాబాదులో దిగిన మొదలు, యివ్వాళ గుంటూరు నుండి బయలు దేరే దాకా, వాసిరెడ్డి సీతాదేవి మా విషయంతో చూపిన అభిమానం ఆప్యాయత అనురాగం మాటలలోకి మార్చి చెప్పలేను. ఒక సంవత్సరంగా ఆమె నన్ను 'మామయ్యా' అని పిలుస్తున్నారు. మాలతి ఏనాడో అంది సీతాదేవితో: మేము ముగ్గురు అక్క చెల్లెళ్లం కాదు, నలుగురం అని! మా యింట్లో అందరికీ సీత, శారద, మాలతీల వంటిదే సీతాదేవి కూడా - అంత సన్నిహితురాలైన వ్యక్తి గురించి ఎక్కువ చెప్ప కూడదు. యలర్జిలనుంచి, ఆస్త్మానుంచి బయటపడి ఆమె సంపూర్ణ ఆరోగ్యవంతురాలవాలనే మేము ఎప్పుడూ కోరుకొనేది - అదే మా ఆకాంక్ష .... అక్టోబరులో టింబర్ మర్చెంట్ ప్రసూన పరిచయం చేసిన టిసి, మేము జి టి దాకా అగనవసరం లేకుండా, కొచిన్ ఎక్స్‌ప్రెస్ ఎ సి స్లీపరులో ఎక్కించాడు. సూ ప ర్ ఫాస్ట్‌లు విజయవాడ వొదిలాక, ఆగేది మద్రాసులోనే! ఉదయం నాలుగున్నరకి సెంట్రల్ చేరుకున్నాం.

## 1988 ఫిబ్రవరి 03

సోవియట్ ఫెస్టివల్, ఐసిసిఆర్ సంయుక్తంగా (Festival of the U S S R and Indian Council for Cultural Relations) కొరియొగ్రఫిక్ మినియేచర్ బాలె కంపెనీ వారి ప్రోగ్రామ్ (Choreographic Miniature Ballet Company) మ్యూజిక్ అకాడమీలో ఏర్పాటు చేశారు. 'సుశ్రావ్యమైన గానవాహినిలో మునకలు వేయాలో, నర్తనశోభకు అచ్చెరు వొందాలో,

ఈ రెండిటి సమన్వయంలోని రస మాధురికి తన్మయ మొంబాలో తెలియ కుండా ఉంది' - అంటూ మెచ్చు కుంది ఒక ఫ్రెంచి పత్రిక, వీరి ప్రద ర్శన చూశాక! లియొనాడ్ యాకొబ్సన్ 'కొరియాగ్రఫిక్ మినియేచర్స్' లో నిష్ణాతుడు. మినియేచర్ అంటే ఏమిటో చెప్పాలి. ప్రపంచ ప్రఖ్యాత శిల్పి రొడన్ (Rodin) నిత్యవసంతం, చుంబనం, ఫ్రాన్సెస్కా (Eternal Spring, Kiss, Francesca) వంటి అనేక శిల్పాలకు జీవకళ పోశాడు. నర్తకీ నర్తకులు వివిధభంగిమలలో, గానానికి అనుగుణంగా డాన్స్ వేస్తూ, ఆ శిల్పాకృతిని మనకు చూపిస్తారు. అలాగే రష్యన్ జానపద గాథల ఆధారంగా కూడా మినియేచర్స్ ప్రదర్శిస్తారు. ఈ బృందంలో మొత్తం ఏభై అయిదుగురు లావణ్యవతులూ సుందరకారులూ ఉన్నారు. వీరు ఇరవై ఏకాంకికలు, అరవై మినియేచర్స్‌లో శిక్షణ సంపాయించారు. చిత్రకారుడు షాగల్ పెయింటింగైన 'వెడ్డింగ్ కార్టెజి' (Wedding Cortege - పెళ్ళివారు) ముగ్ధమనోహర ఛాయలకు ప్రతిరూపం. 1976 నుంచి యాకొబ్సన్‌తో బాటు మకరోవ్ కూడా ఈ కంపెనీ అభివృద్ధికి పాటుపడుతున్నారు. సోవియట్ సంప్రదాయం, సంగీత రీతులు, వస్తు స్వరూపం లోతుగా తెలియకపోయినప్పటికీ, ఆ కళాకారులలోని ఆంగికం, సౌకుమార్యం, లయబద్ధమగు విన్యాసం, సంగీత ఝరితో కలిసిపోవడం - యివి మనవి ఆనంద డోలికలపై విహరింపజేస్తాయి.

. . . . . 04

'సన్నజాజి పువ్వులో, కన్నెపిల నవ్వులో.... అందకత్తె చూపుల్లో, సందెగాలి వూపులో' ప్రేమ ఎలా ఉంటుందో చెబుతారు శోభన్ బాబు, రాధ (వేటూరి గీతిక - బాలు, జానకీల గాత్రం). అలాగే, 'యర్రా యర్రాని రూపు - వర్రా వర్రాని సూపు సత్యభామో, సత్యభామ' (సీతారామ శాస్త్రిరచన - బాలు, సుశీలల గాత్రం). 'నీ కొంగూ - నీ పొంగూ, కోలాటమాడిందమ్మా' అనే జొన్న విత్తుల పాటకు బాలు, జానకీల గాత్రం. 'మహమాయదారి కాలమొచ్చెతల్లో' (వేటూరి రచన - బాలూ శైలజల గాత్రం).... 'ఓ పగటి భాగవతులూ మీ పాటకు జేజేలు - రంగులు పూయని వేషగాళ్లు - ఈ సంఘంలో కో కొల్లలుండగా - మీ కులవిద్యను అడిగేదెవరు ?' - అని నారాయణ రెడ్డి ప్రశ్నించే గీతానికి గాత్రం బాలసుబ్రహ్మణ్యం.... సంగీత దర్శకత్వం : రాజ్ - కోటి.... రాఘవేంద్ర సినీ క్రియేషన్స్‌వారి 'దొరగారింట్లో దొంగోడు' చిత్రంలో శోభన్‌బాబు, రాధ, సత్యనారాయణ, మారుతీరావు, రాజా, హరిప్రసాద్, అన్నపూర్ణ, పూర్ణిమ మున్నగువారున్నారు. గణేశ్ పాత్రో మాటలు. దర్శకత్వం: కోడి. రామకృష్ణ. నిర్మాత : కందేపి సత్యనారాయణ. పి ఆర్ ఒ : ఉమ.

06

దేశ సమగ్రతకు, సమైక్యతకు సంబంధించిన సెమినార్ నిర్వహించారు పంజాబ్ అసోసియేషన్ వారు లజపతిరాయ్ భవన్‌లో. (అధ్యక్షులు : బలదేవ్‌జీ. కార్యదర్శి : హర్‌భజన్ సింగ్) Seminar on 'Religion and Politics'—In the cause of National Integration and Solidarity. ఉదయం తొమ్మిదింపావుకి ప్రార్థన. అనంతరం యమ్‌జి ఆర్ మరణానికి సంతాపసూచకంగా రెండు నిముషాలు మౌనం.... "సంకుచిత భావాలకు ఆస్కారం లేకుండా జాతీయతాభావంతో అజాద్ హింద్ ఫౌజ్ నిర్మించిన నేతాజీ సుభాస్ చంద్రబోస్ చిరస్మరణీయుడు. మన స్వాతంత్ర్యజ్యోతి వెలిగించేందుకు మత చింతన అనేది కించిత్తుకూడా లేకుండా ఎందరో భారతీయులు జలియన్‌వాలాబాగ్ సంఘటన నుంచీ రక్తం చిందించారు - భారతీయులందరూ ఒకటే, భారతజాతి ఒక్కటే, యిందులో మత ప్రసక్తిలేదు" - అన్నారు స్వాగతం పలికిన బలదేవ్‌జీ .... "మతమనేది వ్యక్తిగత విషయం. నేటిరాజకీయాలలో దానికిస్థానంలేదు. ప్రతి మతమూ సహన సౌశీల్యాలనే బోధిస్తుంది. కబీరు చెప్పినా, తులసీదాస్ చెప్పినా, తిరుక్కురళ్ చెప్పినా, గురునానక్ చెప్పినా-మానవులందరూ ఒకటేననీ, యిరుగు పొరుగు పట్ల స్నేహ వాత్సల్యాలు చూపమనీ, భూత దయని మించిన సుగుణం



గొల్లభామ గెంతడం చూశారు కదా - దాని కంరాడలలోని శక్తి ఎంతటిదో చెప్పగలరా? చెప్పలేరు - చెప్పడం కష్టం. మనిషి కండరాలలో గల-శక్తికి పదింతలంటే ఆశ్చర్యంగా లేదూ? అంతటి కండర బలం గల ప్రాణి నత్తగుల్లలలో మాత్రమే ఉన్నది.

లేదనీ అన్నారు... సభ్య జీవన విధానానికి ప్రజాస్వామిక పద్ధతి - పరస్పర సంప్రదింపులతో వొప్పందానికి వచ్చే పద్ధతి-శ్రేష్టమని శ్రేయోదాయకమని విజ్ఞులు అమోదించారు. మనకీనాడు కావల్సినది సమైక్యతా భావన - భారతీయులమనే అంతర్లీన దృక్పథం. భారతీయత తర్వాతనే మన భాష, మన ప్రాంతము, మన కుల మతాలు శాఖోపశాఖలూను. . . ........జాతీయ సమస్యలను పరిష్కరించేందుకు జాతీయ దృష్టి కావాలి. పార్టీ లక్ష్యాల కంటె జాతిక్షేమం ముఖ్యం, జాతీయత

ముఖ్యం. సబ్ కల్చర్స్ (Sub-Cultures) పెరుగుతున్నవి మన జాతీయ సంస్కృతిని దెబ్బ తీయకుండా చూడవలసిన భారం మనందరి మీద ఉంది" - అన్నారు అధ్యక్షత వహించిన మద్రాసు హైకోర్టు న్యాయమూర్తి స్వామికన్నూ... "మనం ఈనాడు ఎంతకీ సైన్సునీ టెక్నాలజీనీ తప్ప హిస్టరీని విస్మరిస్తున్నాం. తర్కాన్ని నమ్ముకు, మనస్సుని విస్మరించకూడదు - ఈ రెండిటినీ సమన్వయ పరిచేదే హృదయం. ఇండియన్ సివిలిజేషన్ లో మతోద్దీపనకు ప్రాముఖ్యం లేకపోలేదు. పక్కనున్న బర్మాలో బౌద్ధం, పాకిస్థాన్‌లో ఇస్లామ్... ఎంతో దూరదృష్టితో భారత రాజ్యాంగ నిర్మాతలు, మన రాజ్యాంగ శాసనాన్ని సెక్యులర్‌గా చేశారు. 22 శతాబ్దుల వెనక అశోకచక్రవర్తి అవలంబించిన పద్ధతి అదే! కాతలిక్కులకీ, ప్రొటెస్టెంటులకీ మధ్య జరిగిన వందసంవత్సరాల యుద్ధం గురించి ఐరోపా చరిత్ర చెబుతున్నది. రామాయణ మహాభారతాలు పర్షియన్ భాషలో ఉన్నాయి....1857 నాటి తిరుగుబాటులో మతం అనే మాట ఎక్కడా వినపడలేదు, విభజించిగాని పాలించలేమని తెలుసుకొన్న బ్రిటిష్ ప్రభువులు, 1905లో 'సెపరేట్ ఎలక్టరేట్' ద్వారా విష బీజం నాటారు. ఆనాటి విత్తనమే చివరికి దేశవిభజనకు దారితీసింది ... ఖాలిస్తాన్ ఉద్యమానికి ప్రోది చేస్తున్నవి మత మౌఢ్యశక్తులు కావని ఎవరనగలరు? ... ఈ నలభై ఏళ్ల స్వాతంత్ర్యంలోనూ మన పాలకులు విద్యారంగాన్ని భ్రష్టు పట్టించి కుల మత శక్తులకి ఆలవాలం చేశారు. ... రాజకీయంగాను, విద్యాపరంగాను ప్రజలలో మార్పు వస్తే తప్ప, పత్రికలు సెన్సేషనలిజమ్ గాక పౌరభాధ్యత వైపు మొగ్గితే తప్ప, మన దేశ పరిస్థితులు చక్కబడవు" — అన్నారు ముఖ్య అతిధిగా విచ్చేసిన ప్రముఖ విద్యావేత్త మాజీ వైస్ - ఛాన్సలర్ చిట్టిబాబు. ... నాలుగు సెషన్స్ గల ఈ సెమినార్ సాయింత్రం అయిదుదాకా ఉంటుంది. 'భా' రామస్వామి అధ్యక్షులుగా గల మొదటి సెషన్ మాత్రం కాసేపు విన్నాను. ఈ సెమినార్ యువతీ యువకులకు ఒకవిధంగా ప్రబోధ కారకం. .... అమెరికాలో ఉంటూ అప్పుడప్పుడు మద్రాసు వచ్చే డాక్టర్ చెల్వపిళ్లగారి (కార్డియాలజిస్ట్ - నెల్లూరు వాస్తవ్యులు) పెద్దమ్మాయి సౌ॥ భువనేశ్వరికి, రాజమండ్రి గాదె కృష్ణమూర్తిగారి పెద్దబ్బాయి చి॥ కిషోర్‌కి ఈ ఉదయం వుడ్‌లాండ్స్‌లో వివాహం జరిగింది. సాయింత్రం రిసెప్షన్‌కి వెంపటి చినసత్యం పార్టీవారి కూచిపూడి నృత్య ప్రదర్శన - నృత్య కళా కారిణులందరూ చాలా బాగా చేశారు. ... చెల్వపిళ్ల దంపతులు ఎంతో స్నేహపాత్రులు. వారి అమ్మాయికీ, అల్లునికీ సర్వశుభములూ

చేకూరాలని మనసారా కోరుకుంటున్నాము.

. . . . 11

'దేవి - శ్రీదేవి' లో రామ్ ప్రసాద్ ఆర్ట్ వారి పాటల ప్రొజెక్షన్. అరు పాటలూ వేటూరి సుందర్రామ్మూర్తివి- సంగీతం : చక్రవర్తి.... 'డాషింగ్ వీరుడే అందాల మాకృష్ణమూర్తి' - అని అతనంటే 'ఓ కొంటె గోపికా, నీ కొంగు కానుకా, అందించుకో అర్ధరాత్రి' – అని సలహా,... 'బుగ్గ కంది, సిగ్గుచిందులాడి, కంటిపాప మాటలాడింది' - అని ఆమె వాపోగా, 'ముద్దులతోనే తీర్చుకుంటా తాపం' - అని అతను చెబుతాడు,.... 'ఆటేసుకుందామా ఒక్కసారి వాటేసుకుందామా' - అని అతనూ, 'వాటేసుకుందామా – చాటుమాటు' - అని ఆమె.... అతను కృష్ణ - ఆమె కాసేపు రాధ, కాసేపు సుహాసిని.... యస్ వరలక్ష్మి, నూతన్ ప్రసాద్, గిరిబాబు, గొల్లపూడి, శుభలేఖ సుధాకర్, పూర్ణిమ, వై విజయ మున్నగు వారున్నారు. శ్రీనివాస చక్రవర్తి కథకు సత్యానంద్ మాటలు. కోడి రామకృష్ణ దర్శకత్వం, నిర్మాత : యన్ రా మ లిం గే శ్వ ర్రా వు..... మీరిది చదివేనాటికి పిక్చర్ రిలీజై ఉంటుంది.

. . . . . 14

మైలాపూర్ అకాడమీ వారి ఇంటర్ కాలేజియేట్ వక్తృత్వ పోటీ పి యస్ హయ్యర్ సెకండరీ స్కూలులో. ఇచ్చిన అంశాలు : 1 భారత్ - శ్రీలంక ఒప్పంద పరిణామం ; 2 ప్రభుత్వ రంగసంస్థల తీరుతెన్నులు.... వివిధ కాలేజీల నుంచి పదిపన్నెండుగురు విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్నారు ; తమ పరిధి మేరకు చక్కగా చెప్పారు. న్యాయ నిర్ణేతలు: పాటిబండ్ల విజయలక్ష్మి, భరణి, యన్నార్ చందూర్....

....మ్యూజిక్ అకాడమీ మినీ హాలులో రచన, అమెరికన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియన్ స్టడీస్ ('Rachana' and American Institute of Indian Studies) సంయుక్తంగా 'రామ్ దులాల్ - దే' గురించి ఒక ప్రసంగం ఏర్పాటు చేశారు. ఈ 'రామ్‌దులాల్ - దే' ఎవరనగా కలకత్తా నుంచి భారత సుగంధ ద్రవ్యాలు అమెరికాకు ఎగుమతి జేసిన మొట్టమొదటి వణిజుడు. అమెరికాతో వర్తక వ్యాపారాలు ఎంతో నిజాయితీతో నిర్వహించిన ఈ 'రామ్‌దులాల్ - దే' కి అమెరికన్ వర్తకులు 1801 లో జార్జి వాషింగ్టన్ పెయింటింగొకటి తమ కానుకగా బహూకరించారు. ఆ చిత్రపటమిప్పుడు ఢిల్లీలోని అమెరికా రాయబారి కార్యాలయంలో ఉంది.... వెనక మద్రాసు అమెరికన్ సెంటరులో సాంస్కృతిక వ్యవహారాల సలహాదారుగా పని చేసిన యస్ కృష్ణన్ ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు ; అమెరికన్, స్కాలరూ, వర్జీనియా రాష్ట్రంలోని వాషింగ్టన్ యూనివర్సిటీ పరిశోధక శాఖకు డైరక్టరూ, టర్కీ, చైనా జపాన్, తాయిలాండ్, యూరప్, యింకా అనేక దేశాలు పర్యటించిన జేమ్స్ వైట్ హెడ్ (Prof James W.

Whitehead) 'రామ్‌దులాల్ - దే' గురించిన విశేషాలు, స్లయిడ్స్‌తో వివరిస్తూ చెప్పారు.... బియస్సార్ కృష్ణ (రచన) స్వాగతం తెలుపగా, పప్పు వేణుగోపాలరావు (డైరక్టరు: ఏ ఐ ఐ యస్) వందన సమర్పణ గావించారు.

. . . . . 15

" 'పుత్రాత్ ధ్యే పరాజయం' - తండ్రిని కొడుకు ఓడించడం, గురువుని శిష్యుడు ఓడించడం కంటే ఆనంద దాయకమగు ఓటమి మరొకటి ఉండదు .... తొమ్మిది కేంద్రాల నూరురోజుల విజయంతో, రాయపరాజుగారి కుమారులు తండ్రిని ఓడించారు.... దర్శకుడంటే పూసలలోని దారం - ఆధారం.... ఈ సందర్భంగా కోడి రామకృష్ణని 'దర్శక సవ్యసాచి' అంటున్నాను" - అన్నారు నారాయణ రెడ్డి, ఫిలిమ్ ఛాంబర్‌లో జరిగిన 'మనవడొస్తున్నాడు' శతదినోత్సవ సభకు అధ్యక్షులుగా. ఆంధ్రాలో సాలీనా చిత్ర పరిశ్రమ ద్వారా 103 కోట్లు వసూలవుతున్నాయన్నారు డివి యస్ రాజు.... ఏ చిత్రానికైనా కథా బలమే జీవమిచ్చేది - అన్నారు గొల్లపూడి మారుతీరావు. తనుకూడా తన కుమారునివల్ల (శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి) చిత్ర నిర్మాణ రంగంలో ఓడిపోయా ననీ, మల్లెపువ్వు తెల్లన, మంచు చల్లన - అని చెప్పనవసరం లేనంతటి ప్రతిభాశాలి కోడి రామకృష్ణ అనీ అన్నారు కౌముదీ యమ్మెస్ రెడ్డి. ఎనిమిదిన్నరకి గెస్టులెవరో వస్తుండ టం వల్ల చివరిదాకా కూచునే అవ కాశం లేకపోయింది.

. . . . . 20

డైనింగ్ టేబుల్ దగ్గిర భోజనా లకి కూచున్నప్పుడు ఫోన్ మోగితే, ఒకసారి తను వెళ్తే, మరొకసారి నేను వెళ్లటం - అదీ స్థూలంగా మా ఒప్పందం. నిన్న మధ్యాహ్నం తను మొదటిసారి వెళ్లినప్పుడు రాంగ్ నెం బరు - రెండోసారి నేను వెళ్లినప్పుడు 'శకుంతలని' - అన్నారు అవతల కొస నుంచి! 'శకుంతలారావు ఫ్రమ్ స్టేట్స్' అంటే 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' జరిగి వుండేది కాదు. నాలుగు గంటలకి శకుంతలారావు', కుమార్తె లలితతో వచ్చినప్పుడు 'యపాలజీస్' చెప్పాను - ఆమె నవ్వుకున్నారు. శకుంతలారావు దంపతులు బాగా పరిచితులు - వారికి మా యిద్దరి రచనలూ యిష్టం.... 'రావుగారు రాలేదేమి?' అని అడిగి నప్పుడు, 'పొద్దుట్నుంచీ నాకు కనిపిస్తే కద!' - అన్నారామె. ఆయన టెక్నో క్రాట్ - ఆ లైనులోనే ఆయన బిజి నెస్ కూడా - ఆయన, ఆయన భార్య వారి నలుగురు అమ్మాయిలూ 'ఎన్, ఆర్ ఐ'లు (Non Resident Indians) -గ్రీన్ కార్డు హోల్డర్స్. ఆ విషయాలు వొదిలేద్దాం - వారి స్నేహాభిమానం ముఖ్యం.... తల్లీ కూతురూ యిద్దరూ మాలతీ చందూర్ ఫాన్స్, వంటలు - పిండివంటలు, అందాలు - అలం కారాలు, మహిళలకు మధుర జీవనం,

'స్వాతి'లో పాత కెరటాలు - యిలా ప్రశంసా వర్షం తగ్గాక మామూలు మాటలలో పడ్డాం.... పొద్దుట బ్రేక్ ఫాస్ట్‌కి 'భోళా' రమ్మని ఆహ్వానించారు. మొదట్లో మాలతి తను రావడం సందేహమనీ, మామయ్య వస్తారనీ చెప్పింది. 'వారు మూడు సార్లు వచ్చారు మనింటికి - నువ్వుకూడా రాకూడదా?' - అని యివ్వాళ పొద్దుట అన్నప్పుడు, ఒప్పుకుంది.... 'భోళా' థర్డ్ ఫ్లోర్‌లో తల్లీకూతుళ్లు ఒక రూమ్‌లోను, రావుగారూ ఆయన ఫ్రెండూ మరొక రూమ్‌లోను వున్నారు.... బ్రేక్‌ఫాస్ట్ ముల్లోనే బేరం పెటారు 'కంచి' రమ్మని. 'మామయ్య కీర్తికాముడు - ఆయనని తీసుకువెళ్లండి'-అంది మాలతి ....'చందూర్‌గారిని ఎలానూ తీసుకు వెళ్తాం - మిమ్మల్ని జంటగా తీసుకు వెళాలని కదా మా కోరిక' - అని అందుకున్నారు, పైప్ నెంతో పదిలంగా పట్టుకొనే రావుగారు.... భోళా నుంచి జయ శ్రీనివాసన్ దంపతుల యింటికి వెళ్లాం - అమ్మాయి లలిత ఫోన్‌లో చెప్పింది యిలా వస్తున్నామని! శ్రీనివాసన్ 'ఒ.యన్.జి.సి' ఛెయిర్‌మాన్‌గా రిటైరై, ఉచితంగా సాంకేతిక సలహా అందజేస్తున్నారు— అనేక సంస్థలకు! ఇక, జయాశ్రీనివాసన్ రామచరితం చెబుతున్నప్పుడు త్యాగరాజు, రామదాసు, తులసీదాసు, ఆదికవి వాల్మీకి - ఆమె గాత్రమాధురిలో మన కళ్లముందు సాక్షాత్కరిస్తారు.... మాలతిని మా యింటివద్ద దింపి, బాలమురళీకృష్ణ యింటికి వెళ్లాం....



ఆదికవి నన్నయ, ఆధునిక యుగకర్త కందుకూరి, భరత ఖండాన్ని పాడి అవు అన్న చిలకమర్తి, కాశీమజిలీ యాత్రల మధిర సుబ్బన్న దీక్షితులు వంటి ప్రముఖులు గోదావరీతీర రాజమహేంద్రవరానికి చెందినవారు. అటువంటి రాజమండ్రి నుంచి, అర్ధ శతాబ్దికి పూర్వం రచనా వ్యాసంగం ప్రారంభించి, తెలుగు వ్యావహారిక భాషలో, కల్పనా సాహిత్యం సహస్ర నవలా పుష్పాలుగా ఆంధ్ర పాఠక లోకానికి అందించిన చిరస్మరణీయులు కొవ్వలి లక్ష్మీ నరసింహరావు.



రావుదంపతులు సంగీత ప్రియులు; వారి అమ్మాయి లిద్దరు నాట్యకళలో శిక్షణ పొందారు; ఇంట్లో అందరూ విధిగా తెలుగే మాట్లాడాలి - బయట కెళ్లినప్పుడే ఇంగ్లీషు....రాలరగించే సంగీతంలోనేగాక, రంజన వానగూర్చే కబుర్లలో కూడా బాలమురళి అద్వితీయులు.... బు జా ను న్న బా గ్ లో ని

కెమెరాతీసి, శ్రీనివాసన్ దంపతు లింట్లో క్లిక్‌మనిపించారు రావుగారు ఇక్కడ మళ్లీ బాలమురళితో.... పన్నెండుదాటింది. నన్ను యింటిదగ్గిర దిగబెడుతూ ఒంటిగంటన్నరకి వస్తా మన్నారు. అప్పటికే లలిత, రావు గారూ వంతులువారీగా తనని కంచి రమ్మని అడగటంతో, మాలతి కాదన లేకపోయింది.... ఒంటి గంట ముప్పావుకి బయలుదేరాం - ఎసి కారవటంవల్ల ప్రయాణ బడలిక లేదు. కాసెట్‌మ్యూజికూ, కబుర్లూ (జయ లలిత, జానకీ రామచంద్రన్).... మూడుంపావుకి కంచి చేరుకున్నాక, మొట్టమొదట పట్టుచీరెల షాపుకి! ఒక గంటసేపు చేనేత వైభవాల సౌందర్య దీవిలో, హస్తకళాకౌశలపు రంగుల రామణీయకతలో, ఆ చీరెల దొంతరల మధ్య, ఏది బావుందనిగాక ఏది నచ్చుతుందనే తర్జన భర్జనలో పడ్డారు. చివరికి నాలుగు చీరెలు సెలక్ట్ చేశారు.... అక్కడనుంచి హోటల్‌కి! హెవీ బ్రేక్‌ఫాస్ట్ అవడం వల్ల అందరం లంచ్ స్కిప్ చేశాం - అయినప్పటికీ ఎవరికీ అంత ఆకలిగా లేదు. వేడి వేడి బోండాలూ కాఫీ అయాక, శంకరాచార్యుని దర్శనానికి వెళ్లాం.... పెద్దాయన (చంద్రశేఖరేంద్ర సరస్వతి)ఆశీర్వాదం పొంద గలిగింది. లలిత, రెండో ఆయన (జయేంద్ర సరస్వతి) ప్రయాగ కాబోలు వెళ్లారట. మూడో ఆయన నాలుగైదు కిలో మీటర్ల దూరానున్న గ్రామంలో ఉన్నారు - ఆశ్రమానికి చెందిన హరి హరన్ మమ్మల్ని అక్కడికి తీసుకు వెళ్లారు. వాహ్యాళి నుంచి స్వామి యింకా రాలేదు. చీకటి పడుతోంది కదా అని మేము ఎదురు వెళాం.... విశాలమైన ఇసుకపఱ్ఱ - బహుశా వర్షా కాలంలో అదొక చిన్న ఏరు కావచ్చు. మేకలమంద అయిదు నిముషాలక్రితమే మాముందునుంచి వెళ్ళింది. మూడు వైపులా క్షితిజరేఖ - దూరాన ఏవో ఆకారాలు - ఆకాశాన చంద్రవంక, అక్కడక్కడ నక్షత్రాలు. చీకటిపడా ఆరుబయట యింకా మసక వెల్తురు, ఇసుకలో చతికిలబడ్డ మేము, ప్రకృతి వొడిలో పరిశుభ్రమైన గాలిపీలుస్తూ, నేత్రానందకర దృశ్యాన్ని మనో ముద్రి తం చేసుకుంటున్నాము.... 'స్వామి వస్తున్నారు' అన్నారు హరిహరన్. అందరం లేచి నిలబడ్డాం. శిష్యుల వెంట వస్తున్నారు స్వామి (శంకర ఆనం దేంద్ర సరస్వతీ) ఇరవై ఇరవై రెండేళ్ల వయసుగల ఆతేజోరమూర్తి ముఖంలోని వర్చస్సు, అంధకారాన్ని చీల్చగల దివ్యజ్యోతిలా ఉంది.... రావుగారు ఆయన వెంట ఆశ్రమం దాకా నడిచి వెళ్లారు - స్వామి కరుణ, ప్రసాదం, వస్త్రం పొందగలిగారు.... ఆ తర్వాత కామాక్షీదేవి ఆలయం - అర్చన, హారతి ; అమెరికాలోని తమ మిత్రులకు పటాలూ, జ్ఞాపికలూ కొన్నారు.... దారిలో జంబూ కొబ్బరి బొండాలు ; తొమ్మిది అయ్యేసరికి మద్రాసు చేరుకున్నాం.... మర్నాడు ఉదయం ఆరుగంటలకి శకుంతలా రావు దంపతులూ వారి అమ్మాయీ

యిదే కారులో సేలం తిరుచ్చిల మీదుగా కన్యాకుమారి వెళ్తున్నారు.... వివేకానందారాక్ చూసివచ్చాక, ఆ 'థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియెన్స్' చెబుతానంది లలిత.... మార్చి ఒకటో తేదీకి తిరిగి మద్రాసు వస్తారు ; రెండు సాయింత్రం హైదరాబాదు ; మూడో తేదీన ఢిల్లీ ; అయిదున ఢిల్లీ నుంచి అమెరికాకు.... 'రెండోతేదీ మధ్యాహ్నం మీ యింట్లోనే భోజనం' – అని నమ్మకంగా చెప్పారు.... ఆ మాట నిలబెట్టుకున్నా, నిలబెట్టుకోకపోయినా, బాలమురళి క్యాసెట్స్ కోసమైనా మమ్మల్ని కలుసుకోక తప్పదు.... ప్రతి స్నేహానికీ ఒక పరిమళం ఉంటుంది. ఇది సన్నజాజో, సంపెంగో చెప్పలేను.

. . . . . 21

ప్రముఖ సినీ నిర్మాత అట్లూరి పూర్ణచంద్రరావు దంపతుల కుమారుడు చి॥ రత్నాకర్‌కీ, సౌ॥ శ్రీదేవికీ విజయవాడ బందరు రోడ్‌లోని టిటిడి కళ్యాణ మండపంలో ఫిబ్రవరి 19వ తేదీ రాత్రి 8 గం॥ 39 ని॥లకు వివాహం జరిగిన సందర్భంగా, ఈ సాయింత్రం విజయా శేష్‌మహల్‌లో రిసెప్షన్.... ధనంజయ దంపతుల నాట్య ప్రదర్శన ఎంతో రసవత్తరంగా ఉంది. మద్రాసు చిత్రపరిశ్రమలోని ప్రముఖులందరూ అక్కడే ఉన్నారు. నూతన దంపతులకు మా శుభాకాంక్షలు.

. . . . . 23

'జ్యోతి' మాసపత్రిక రజతోత్సవం జరిగింది కాస్మాపాలిటన్ క్లబ్‌లో. సిల్వర్ జుబిలీ సంచికను విడుదల చేసిన జెటి ఆచార్యులు ఐఎయస్ (తమిళనాడు ప్రభుత్వపు కార్మికశాఖ కమీషనర్), 'జ్యోతి' ప్రారంభంనుంచీ ఒకళ్ళ హాత్తస్థాయినికాపాడుకుంటోందని అన్నారు. మొదటి కాపీ రమణయ్యరాజా అందుకున్నారు. ప్రథమ సంపాదక వర్గంలోని వారైన బాపు, రావి కొండలరావు, వి ఎకె రంగారావులని ఈ సందర్భంగా గౌరవించారు. ఇరవైఅయిదేళ్లగా 'జ్యోతి'ని విజయవంతంగా వెలువరిస్తున్న సంపాదకురాలు లీలా రాఘవయ్య అభినందనీయురాలు. ఈనాటి కార్యక్రమ నిర్వాహకులు మోహనరావు.

. . . . . 25

టోక్యోలో ఎయిర్ ఇండియా మేనేజరైన డియన్ లింగం,సీతాదంపతుల కుమార్తె డా॥ రాధికకు, సౌత్ సెంట్రల్ రయిల్వే సీనియర్ డివిజనల్ మేనేజరైన బివి రత్నం దంపతుల కుమారుడు డా॥ శేషుకృష్ణకు ఈ ఉదయం వుడ్‌లాండ్స్‌లో 10 గం॥ 18 ని॥లకు శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. ముహూర్త మయాక లంచ్.... నూతన వధూవరులకు మా శుభాభినందనలు.... 'మద్రాసు తెలుగు అకాడమీ' వారి పత్రికా సమావేశం ఈ సాయింత్రం వుడ్‌లాండ్స్‌లో. 1981లో స్థాపింపబడిన ఈ అకాడమీ, లలిత కళల ద్వారా, సాంస్కృతికోత్సవాల ద్వారా జాతీయ సమైక్యతకు, జాతీయ దృక్పథానికి కృషి చేస్తున్నది – 'తెలుగు

అనే శబ్దం వున్నంత మాత్రాన అది తెలుగువారికి మాత్రమే పరిమితం కాదు. దేశ సౌభాగ్యం, విశ్వమానవ శ్రేయ.ం 'మద్రాసు తెలుగు అకాడమీ' లక్ష్యాలు. భారత్ కల్చరల్ ఇంటగ్రేషన్' కమిటీ దేశవ్యాప్తంగా సమైక్యతా సాధనకు సంగీత నాట్యాల ద్వారా కృషి చేస్తుంది; 'మద్రాసు తెలుగు అకాడమీ' చెన్నపట్నంలో మాత్రమే ఆ లక్ష్యాల మేరకు కృషి చేస్తుంది.... విభవ ఉగాది ఉత్సవం మార్చి 20వ తేదీన మ్యూజిక్ అకాడమీలో, సాయంత్రం మూడున్నరకి ప్రారంభ మవుతుంది. పద్మ భూషణ్ నాగేశ్వర రావు అధ్యక్షులు.త ఫిలిప్స్ ఇండియా, రిచ్‌మన్ గ్రూప్ (మేనేజింగ్ డైరక్టర్ జి విఠల్) - వారిరువురి సౌజన్యంతో ఈ ఉగాది పండుగ వైభవోపేతంగా జరుగుతుంది. 'మద్రాసు తెలుగు అకాడమీ' వారి గౌరవ సత్కారాన్ని అందుకోవడానికి అంగీకరించిన మహ నీయులు: 1 స్వామీ రంగనాథా నంద; 2 మోటూరి సత్యనారాయణ; 3 యమ్ శాంతప్ప; 4 కాన్సర్ ఇనిస్టి ట్యూట్ డా॥ శాంత; 5 'హిందూ' అసో సియేట్ ఎడిటర్ రామ్; 6 'ఆంధ్ర జ్యోతి' ఎడిటర్ నండూరి రామ్మోహన రావు; 7 నార్ల తాతారావు; 8 మృదంగ విద్వాన్ గోపాలకృష్ణన్; 9 నాట్యకళా కారిణి మాళవిక; 10 రంగస్థల నటుడు ఢిల్లీ గణేశ్; 11 కలంకారీ చిత్ర కారుడు మునికృష్ణ; 12 (ఆమోదం యింకా రాలేదు) .... ఈ పన్నెండూ 'మద్రాసు తెలుగు అకాడమీవి' - ఇవి గాక, మరొక పదిహేను, వేర్వేరు ప్రసిద్ధుల పేరిట యిచ్చే పురస్కారాలు వున్నాయి. అవి అందుకొనేవారు: 1 సెమ్మంగుడి శ్రీనివాసయ్యర్, 2 కొంగర జగ్గయ్య, 3 యమ్మెస్ గోపాల కృష్ణన్, 4 బాలసుబ్రహ్మణ్యం 5 పి సుశీల, 6 గాయిత్రి, 7 సింగితం శ్రీని వాసరావు, 8 మణిరత్నం, 9 రావు గోపాలరావు, 10 అజంతా, 11 టియల్ కాంతారావు, 12 శరత్‌బాబు, 13 రమాప్రభ, 14 వివికె రంగా రావు, 15 పసల సూర్యచంద్రరావు.... ఈ ఉగాది వేడుక చూసేందుకు టికెట్లు లేవు. ముందుగా వ్రాసి కార్యదర్శి వద్ద నుంచి ప్రవేశ పత్రాలు తెప్పించు కోవాలి. అడ్రసు: రావి కొండల రావు, సెక్రటరీ: మద్రాసు తెలుగు అకాడమీ, 25 మొలనీ రోడ్, టి-నగర్, మద్రాసు - 600 017.

..... 26

బివియస్పెస్ మణి దంపతుల కుమార్తె సౌ॥ భువనేశ్వరికి (పద్మ) చి॥ సూర్య ప్రకాశమ్‌కి తిరుపతిలో, 22వ తేదీ ఉదయం 10 గం॥ 31 ని॥లకు తిరుచానూర్ రోడ్‌లోని శ్రీనివాస కళ్యాణ మండపంలో వేదోక్త విధులతో వివాహం జరిగిన సంద ర్భంగా, ఈ సాయంత్రం వుడ్ లాండ్స్‌లో రిసెప్షన్. మద్రాసులో మణిగారిని తెలియనివారు లేరు — ఏ మంచి పనికైనా ఆయన ముందు నుంటారు. వారి అమ్మాయీ అల్లుడూ సుఖ సంతోషాలతో మనుగడ సాగిం

వాలని మనఃపూర్వకంగా దీవిసున్నాము.

. . . . . 27

"సమాజ స్వరూపం రాజకీయాలపై ఆధారపడి వుంటుంది గనక రాజకీయ ప్రస్తావన లేకుండా ఎలా? అయితే ఈ చిత్రం సెటైర్ కాదు — కొంచెం సీరియస్‌గానే ఉంటుంది. ఒక సమస్య పూర్వాపరాలు గుండెలకి హత్తుకొనేటట్లు రసాత్మకంగా చెప్పడమే ఏ కళా ప్రక్రియ అయినా చేయగలిగినది" అన్నారు - 'అల్లుడు బాబోయ్ అల్లుడు' ముహూర్త సందర్భంగా పద్మాలయా ఆఫీసులో — ఈ చిత్రానికి కథ సమకూర్చి, యిందులో ఒక ప్రధాన పాత్ర నిర్వహిస్తున్న ప్రభాకర రెడ్డి, 'గాంధీ పుట్టిన దేశం' తీసిన నాటికీ, యిప్పటికీ, తెరమీద, తెర వెనుక, తెర ముందూ ఎన్నో మార్పులు వచ్చాయన్నారు. దర్శకత్వం: పి. చంద్రశేఖర రెడ్డి. నిర్మాత: వర్మా ఫిలింస్ డివియన్ రాజు........ విజయా శేష్ మహల్‌లో, 'నిప్పో-డయనొరా'ల ఓబులరెడ్డి దంపతుల కుమార్తె సౌ॥ విజయలక్ష్మికి, రాఘవ రెడ్డి దంపతుల కుమారుడు చి॥ అశోక్‌కీ ప్రధానం. పారిశ్రామిక రంగానికీ, రాజకీయ రంగానికీ చెందిన వారెందరో వచ్చారు. మద్రాసు తెలుగు అకాడమీ అధ్యక్షులు, సంగీత ప్రియులు, సాహిత్యాభిమానులు, కళాపోషకులు, ప్రముఖ పారిశ్రామికవేత్త అయిన ఓబులరెడ్డి గురించి వినని వారెవరు? పద్మశ్రీ కృష్ణన్ నాదస్వరం శుభం పలికింది. యమ్మెస్ సుబ్బలక్ష్మి సదాశివమ్ దంపతులతో మాట్లాడుతున్న గోపాలరెడ్డిగారికి, ప్రస్తుతి రామచంద్రన్‌ని పరిచయం చేశాను. ఇక భోజనాలయేదాకా వారిద్దరూ ఒకటిగా వున్నారు రాజకీయ చరిత్ర మాట్లాడుకుంటూ! లోనికి వస్తూండగా 'ఆమె ఎక్కడ?' అని అడిగారు ఓబుల్ రెడ్డి. 'రేపు పొద్దుట సుముహూర్తానికి వస్తానన్నది' - అని చెప్పాను. .....భోజనాల వేళ, వి ఐ పి రూమ్‌లో ఎదురు వరసలో కూచున్న శివశంకరి 'మాలతి ఏది?' - అని అడిగారు. వెనుకటి సమాధానమే మళ్లీ చెప్పాను. శివశంకరి 'ఒరు మనిదన్ కథ' (తమిళం ........ తెలుగులో 'ఒక మనిషి కథ') మాలతి తెలుగు పాఠకులకు 'స్వాతి' మాస పత్రిక సీరియల్‌గాను, క్వాలిటీ వారి బుక్ గాను పరిచయం చేసింది......... క్యూలో కారు వచ్చేందుకు ఇరవై నిముషాలు పట్టింది. అంతవరకూ గోపాలరెడ్డిగారు బంధు మిత్రుల కబుర్లతో కాలక్షేపం చేశారు.

. . . . . 28

నిన్న రాత్రి ప్రధానం — ఇవ్వాళ ఉదయం ఏడున్నరకి శుభముహూర్తం. లోనికి రాగానే ముందు బ్రేకఫాస్ట్ అన్నారు.... ఆ తర్వాత గోపాల రెడ్డి నాగిరెడ్డిగార్లు ఏవో కబుర్లు చెప్పుకుంటూ వుండగా, వారికి వెనక వరసలో కూచున్నాను.... ఆంధ్ర ముఖ్యమంత్రి యన్‌టి రామారావు, శివాజీ

గణేశన్, జస్టిస్ నటరాజన్ ఎంద రెందరో ప్రముఖుల ఆశీర్వాదంతో సౌ॥ విజయలక్ష్మి, చి॥ అశోక్‌ల వివాహంఎంతో వైభవంగా జరిగింది. నూతన వధూవరులకు చందూర్ దంపతుల శుభాకాంక్షలు.... సాయంత్రం ఫిలిమ్ ఛాంబర్‌లో కొవ్వలి లక్ష్మీనరసింహారావు స్మృత్యర్థం సాహితీ సభ.... వ్యవహార భాషను ప్రజానీకంలోకి పట్టుకెళ్లిన ఘనత, ఒకనాటి 'ప్రబుద్ధాంధ్ర' తర్వాత, 'ఆంధ్రప్రభ' డయిలీదైతే, పుస్తక పాఠకులలో దానిని వ్యాప్తం చేసినది కొవ్వలి. ఏలూరులో ఒకప్పుడు మాయింటికి అతిసమీపంలో ఉంటూం డేవారాయన. 'ఇంతి - చేమంతి - పూబంతి' వంటి నవలల రోజులవి. మొత్తం ఆయన వెయ్యి నవలలు రాశారట -ఆ లిస్టు పదిహేనూ యిరవై ఏళ్ల క్రితం వేసిన కొవ్వలి సావనీర్‌లో ఉంది. 1912లో తణుకులో జన్మించిన కొవ్వలి, 1975లో మద్రాసులో కన్ను మూశారు - ఇద్దరు కొడుకులు, యిద్దరు కూతుళ్లు. అందరూ పెద్దవాళ్ల యారు - పెళ్లిళ్లయాయి. భార్య, కొవ్వలి మరణానికి, రెండు మూడేళ్ల క్రితమే దివంగతురాలయారు.... యు. విశ్వేశ్వ రావు అధ్యక్షతను, 'కళాభారతి' (ప్రెసిడెంట్: రామ్మోహనరావు - సెక్రటరీ: నరసింహారావు) ఈ ఫంక్షన్ తలపెట్టింది.... ఇన్నేళ్ల తర్వాత అయినా కొవ్వలి గౌరవార్థం యిటు వంటి సమావేశ మొకటి జరగడం ఎంతో ప్రశంసనీయమగు విషయం. బియస్సార్ స్వాగతం తెలిపి, సభా నిర్వాహణగావించారు. ఇంటూరి వెంకటేశ్వర్రావు, రామలక్ష్మి, భమిడిపాటి రాధాకృష్ణ, పప్పు వేణుగోపాలరావు, కాగడా శర్మ ప్రసంగించారు. రాళ్లబండి కామేశ్వరావు వందన సమర్పణ.... నారాయణరావు (అడవి మపిరాజు), మైదానం (చలం), వేయిపడగలు (విశ్వనాథ) తెలుగు పాఠకలోకాన్ని అలరించిన రోజుల్లోనే, కొవ్వలి వారి నవలలూ వచ్చాయి - రయిల్వే సాహిత్యమనే పేరుతో! అధిక సంఖ్యాకులు ఈ రయిల్వే సాహిత్యాన్ని ఆదరించారు, అభిమానించారు; ఎందుకంటే, కొవ్వలి చెబుతున్నది వారి మనసుకి చేరువగా ఉండటంచేత.... రాజరాజేశ్వరీకి (నిర్మాత: కె. బి. నాగభూషణం) కొవ్వలి వ్రాసన 'తల్లి ప్రేమ' అఖండ విజయం పొందింది. అలాగే డియప్ నారాయణకి 'శాంతి', 'సిపాయి కూతురు' యిత్యాదులు.... భయంకర్ అనే పేరుతో ఆయన ఎన్నో నవలలు రాశారు. ప్రస్తుతం 'స్వాతి - వార పత్రిక'లో సీరియల్‌గా వస్తున్న' యువతుల యుద్ధం' ఆయనదే! పాఠకులు ఎలా రిసీవ్ చేసుకుంటున్నారని ఆ మధ్య మేము అడగ్గా, 'సూపర్ హిట్' అన్నారు 'స్వాతి' ఎడిటర్ బాలరామ్... సాహిత్య విమర్శకుల అంచనాలకు అతీతమైనది. కొవ్వలికీ, ఆయన పాఠకులకీ మధ్యగల అనుబంధం.... రేనాల్డ్స్‌ని ఫ్రెంచి సాహితీకారులు గుర్తించలేదు. అంతమాత్రాన ఆయన విలువ తగినట్లా? అలాగే, ఆంధ్రా రేనాల్డ్స్ అనవచ్చు కొవ్వలిని....ఆయనరచనలు

అచ్చులో లేవుగాని యిప్పటికీ వాటికి డిమాండ్ ఉంది.... ఎవరైనా ఉత్సాహవంతులు అందుకు పూనుకోవాలి.

......29

ప్రఖ్యాత ప్లేబాక్ గాయకుడు పి బి శ్రీనివాస్ తమ కుమార్తె సౌ॥ లతకు, చి॥ యప్పి కృష్ణమణికి, నిన్న ఉదయం8 గం॥ 15 ని॥లకు మీన లగ్నంలో తిరుమల కొండ మీది సీతారామకళ్యాణమండపంలోవివాహం జరిపించారు; ఈ సాయంత్రం వెస్ట్ కాట్ రోడ్ వుడ్‌లాండ్స్‌లో రిసెప్షన్. ప్లేబాక్ గాయనీగాయకు లెందరో ఆహూతులను తమ సంగీతంతో ఆనందింప జేశారు. నవదంపతులకు మా శుభాకాంక్షలు.... 'శ్రుతిలయలు' ఎనిమిది నందీఅవార్డులు గెలుచుకొన్న సందర్భంగా సవేరాలాన్స్‌లో సంగీత ధారల చల్లటివేళ చిరునవ్వులు జాలు వారే స్నేహమయ సీమతో, చక్కటి సమావేశం.... "మన సంగీతాన్ని, నాట్యాన్ని సామాన్యునికి చేరువగా తెచ్చే ప్రయత్నమే నేను చేసేది. ఆ ప్రయత్నం విజయాన్ని సాధించి నలుగురి మన్ననా పొందితే, నాకది నైతికంగా ఆత్మ స్థయిర్యాన్ని యిస్తుంది" - అన్నారు దర్శకులు విశ్వనాథ్, పత్రికలవారితో యిష్టా గోష్టిగా!....పూలమాలలూ శాలువలూ కార్యక్రమం గీతాసుబ్బారావు క్లుప్తంగా తొందరగా ముగించారు.... ఎక్కడ చూసినా నందులు - విజయోత్సాహ చిహ్నాలుగా - సవేరా పూల్‌లో ఎనిమిది నందులు, సినీతారలని చూసి



సమాజం పట్ల ఆగ్రహం తెలిపేందుకా గడ్డం పెంచడం? రాజ్‌కమల్ ఇంటర్నేషనల్ వారి 'సత్య సందేశం' (కమలహాసన్) వినరిస్తుందా విషయం.



మరింత సొగసులు పోయాయి.... కస్టర్డ్ కేక్ నందీరూపంలో.... భానుమతి, అంజలీదేవి అయిస్‌క్రీమ్ తింటూ అమెరికాలో వున్న వాళ్లబ్బాయిల గురించి చెప్పుకున్నారు.... డాక్టర్ ముత్తుకృష్ణారెడ్డి చిలిపి మాటలు.... ఎందరో మిత్రుల హాస్యోక్తులు.... ఈ నాటి ఫంక్షన్ 'ఐడియల్ గెట్-టు-గెదర్'.... 'ఇది సరే, మీకు నేషనల్ అవార్డ్ రావాలి' - అన్నాను సుమలత తో. చిరునవ్వుతో థాంక్స్ చెప్పా రామె........ 'శ్రుతిలయలు' గురించి అప్పట్లో వ్రాసిన మాటలు: "దర్శకులు విశ్వనాథ్ దాక్షిణాత్య ప్రేక్షకులకు సమర్పించిన సంగీత మణిహార మిది.

దాంపత్యానికి అర్థం చెబుతున్నట్లుగా వున్నాయి అంజలీదేవి, సత్యనారాయణ పాత్రలు. అల్లరి చూపులు ఆనంద తాండవంతో ప్రేక్షకులని మైమర పిస్తాడు షణ్ముగ శ్రీనివాస్. సుమలత కనులలోను చెక్కిళ్లలోను కావ్యగీతిక లొలికాయి. ఆంధ్రుల గర్వింపదగు ఈ చిత్రానికి నిర్మాతలు: సుధాకర్, కరుణాకర్" ('జగతి' - 373)

మార్చి 02, 1988

1983 లో అయిదు అకాడమీ అవార్డులు పొందిన 'టరమ్స్ ఆఫ్ ఎన్‌డియర్‌మెంట్' (Terms of ndearment - 130 minutes) తల్లీ కూతుళ్ల బాంధవ్యగాథ. తల్లిగా షెర్లీ మెక్లేన్, కూతురుగా డెబ్రా వింగర్. - పొరుగింటి పెద్దమనిషిగా స్త్రీలోలునిగా జాక్ నికోల్సన్.... కష్టసుఖాలు తెలిసిన తల్లి, ఆర్థికంగా నిలదొక్కుకోవడం ముఖ్యమనీ, తొందరగా పెళ్లి చేసుకు పిల్లల్ని కన వద్దనీ చెబుతుంది. తల్లి చెప్పిన హితవుకి భిన్నంగా కూతురు ఒక యువకుని ప్రేమిస్తుంది - పెళ్లాడు తుంది – ముగ్గురు పిల్లల్ని కంటుంది. కూతురు, పసిపిల్లగా వుయ్యాల తొట్టిలో వున్నప్పుడు ప్రారంభమై, ఆమెకి ముప్ఫయ్యేళ్లొచ్చి, ముగ్గురు పిల్లల తల్లిగా హాస్పిటల్‌లో కన్ను మూయడంతో ముగుస్తుంది ఈ చిత్రం – మాతాసుతల బాంధవ్యంలో అల కలూ అనుకోవడాలూ అపేక్షలూ అనురాగాలూ ఎలా మిళితమై జీవితా లని పెనవేసుకొనేదీ చూపుతూ! కూతు రికి వివేకం నేర్పబోతుంది తల్లి; కాని, ఆ కూతురు ప్రేమ, పెళ్లి, మాతృత్వం, పిల్లల పెంపకం, అసూయా అను మానాల వెంట పరుగుతీసి, అలిసి పోతుంది. మాతృశిక్షణ కన్నకూతురిని ఏవిధంగానూ కాపాడ లేకపోయినా ఆ కారణంగా దూరమవరు - చివరికి కష్టంలో ఆదుకొనేది తల్లి, కరుణార్ద్ర తతో చూసేది భర్తా అవుతారు. ఇతి వృత్తం సర్వసామాన్యంగా కనిపిస్తున్న ప్పటికీ ఎన్నో మెలికలతో కూడిన ఈ రసవత్తక చిత్రాన్ని అమెరికన్ సెంటర్లో ఆహ్వానితులకు చూపారు.

—యన్నార్ చందూర్

## ఈ మధ్య అందినవి:

పిలువని పేరంటం - తెలుగు సామెత నాటికలు - 5.... తెన్నేటి సుధారామదాజు.. వంశీకృష్ణ పబ్లిషర్స్, హైదరాబాదు - 44.... రు 25-00

అలలు - కవిత.... ఎ. ఆర్. విద్యార్థి.... మాధురీ పబ్లికేషన్స్, హైదరాబాదు - 380.... రు 8-00.

ప్రకృతితో మానవుని, చెరలాటం. వసంతరావు వేంకటరావు.... భాగ్య నగర్ ప్రచురణలు, మచిలీపట్నం.... రు 10-00.

అందుకున్న పుస్తకాలన్నీ గాక పోయినా కొన్నిటి సమీక్షలు ముందు ముందు సంచికలలో వెలువడుతాయి.

పెదవి కదిపి నవ్వనని
శపథం చేసిన వారిని సైతం
విరగబడి నవ్వించే
గిలిగింతల మార్కు చిత్రం!

రావు గోపాలరావు

ఆర్.జి.ఆర్. ప్రొడక్షన్స్

# స్టేషన్ మాస్టర్

ఎస్. అంబరీష్ ఎస్. జయరామారావు కోడి రామకృష్ణ



సమీక్షలు

# చిత్రజగతి

## వెంకట కృష్ణావారి 'దొంగ పెళ్లి'

దేవాలయం మెట్లమీద దొరికిన శాంతి (విజయశాంతి) హీరోనే (శోభన్‌బాబు) నిండుగా ప్రేమిస్తూ నిస్సంకోచంగా కవ్విస్తూంటుంది. ఆమెపట్ల జాలితప్ప, ప్రణయానురక్తి లేదతనికి. ఇలావుండగా ఆ ఊరి కొక డాక్టరమ్మ (సుమలత) వస్తుంది - మెడికల్ వాన్‌లో. పైకి కరకుగా మాట్లాడినా, పట్టుదలతో ప్రవర్తించినా, విద్యా సంస్కారాలుగల ఈ యువకుని వైపుగా మొగ్గుతుందామె. ఇద్దరూ ప్రేమబాసలు చేసుకుంటారు - పెళ్ళి చేసుకుందా మనుకుంటారు. డాక్టరమ్మ తండ్రి అందుకు అంగీకరిస్తాడు. పల్లెటూరి తెలివితేటలతో, తన పంతం నెగ్గించుకోవాలనే కుయుక్తితో, విషం తాగినట్లు నాటక మాడి హీరోని పెళ్ళి చేసుకుంటుంది శాంతి. అయితే, అది దొంగపెళ్లి అవడంవల్ల మనసులూ కలవవు; తనువులూ కలవవు. బావ నెంత మాత్రం మార్చలేకపోయినా శాంతికి, చాలా సంవత్సరాలుగా శిరోవేదన వున్నట్లు వెల్లడవుతుంది. పట్నం తీసుకెళ్లి డాక్టరుకి చూపగా, అది బ్రయిన్ ట్యూమర్ అని చెబుతారు. శాంతికీ రహస్యం తెలియ నీయకూడదనుకుంటారు. అయితే, ఆమె మాత్రం డాక్టరమ్మకీ బావకీ స్వయంగా పెళ్లి జరిపించి, కన్నుమూస్తుంది. స్క్రీన్‌ప్లే చక్కగా ఉంది; ఘటనాక్రమం సందర్భానుసారంగా ఉంది. శోభన్‌బాబు, విజయశాంతి, సుమలత - ముగ్గురూ బాగా చేశారు. దర్శకత్వం: రవిరాజా పినిశెట్టి. నిర్మాత: అనం గోపాలకృష్ణారెడ్డి.

## సుమప్రియావారి 'బడి'

'బడి' అనే టైటిల్ కొంచెం బాల్డ్‌గా ధ్వనిస్తున్నప్పటికీ, ఈ ప్రయోగాత్మక చిత్రంలోని ప్రతి ఒక్కరూ తమ పాత్రకు యధోచిత న్యాయం చేకూర్చారు. ఒక కాటికాపరి, తన కొడుకుని, తన వరవడిలోనే తాగుబోతుగా చేస్తాడు. 'బడికెళ్లి విష్కారణంగా చెడిపోకు - నా కొడుకువై పుట్టినందుకు నా మార్గం అనుసరించడమే నీ కర్తవ్యం' - అని పైకి స్పష్టంగా చెప్పకపోయినా, ఆ ప్రకారంగా కొడుకుని మారుస్తాడు. తాగు

డులో, అబద్ధాలలో, బయటవారిని మోసగించడంలో తండ్రీకొడుకులు ఒకరికొకరు తీసిపోనంత ప్రవీణు లవుతారు. అనుభవశాలి గనక తండ్రి మరికొంచెం నేర్పరి అవుతాడు. అయితే ఈ దగా, దగుల్బాజీతనం ఎల్లవేళలా చెలుబడి అవదు. కొడుకు లగ్గం (పెళ్లి) చేయమంటాడు - కోడలు వస్తుంది; కడుపున కాయ కాస్తుంది. తన పెని మిటి, తన మామా మాదిరి, ఈ కుర్ర వాడు కూడా నిరక్షరాస్యుడు గాకుండా, నాలుగు ముక్కలు నేర్చుకు బతకగలిగినవాడిలా పెంచేందుకు తాపత్రయపడి, మేస్టారి దయవల్ల విజయమొందుతుంది. మృగప్రాయు లైన తండ్రీ కొడుకులని చూసి జాలి పడతాం; మృగంలోని మనిషిని మేల్కొల్పుతాడు మేస్టారు. ప్రయత్నం గొప్పదేగాని రిలీఫ్ ఎక్కడా లేదు. ప్రధాన పాత్రధారికి యవార్డ్ రావ డంలో ఆశ్చర్యం లేదు - ఎంతో ప్రశంసనీయమైన నటన. దర్శకులు : రామ్ సురేష్ - కోవూరి సాంబశివ రావు. నిర్మాత : సుకన్య.

## అంజనా వారి 'రుద్రవీణ'

సూర్యం (చిరంజీవి) తండ్రి బిల్హరి గణపతిశాస్త్రి కర్ణాటక సంగీతానికి అంకితమైన నిష్ఠాగరిష్ఠుడు. సూర్యం అన్నగారు మూగవాడైనప్పటికీ నాద స్వర విద్వాంసుడు. సూర్యం చెల్లెలు. తండ్రిగారు చేసే పాట కచ్చేరిలో తంబురా వాయిస్తుంది. సూర్యం అని పిలువబడే సూర్యనారాయణశాస్త్రి, తండ్రిగారి నుంచి విద్య నభ్యసించి, ఆయన సంగీత సరస్వతికి కూడా వారసుడవుతాడు. అయితే ఒకరోజున 'మాధాకబళం, తల్లీ' అనే బిచ్చగత్తె పిలుపుతో సూర్యం మనసు ఏకాగ్రతని కోల్పోతుంది; తండ్రీకొడుకుల వైరం ప్రారంభమవుతుంది. 'కట్టెలు కొట్టే వారి అలసటని తీర్చేపాట, సంగీత మెందుకవదు?' - అని ప్రశ్నిస్తాడు సూర్యం. దయార్ద్రత లేనినాడు, పొరుగు మనిషి కష్టసుఖాలకు స్పం దించనినాడు గానోపాసన సంఘ పరంగా నిరర్థకమంటాడు. ఆలయ ప్రవేశార్హతలేని ఒక హరిజన యువతి (అశ్విని) కొండమీద నటరాజు విగ్రహం పెట్టుకు నాట్యం వేయడం, సూర్యాన్ని కదిలిస్తుంది - వసంత ఋతువు హృదయారామాన ప్రవే శిస్తుంది. కాని, ఊరువారి మేలుకోసం, వారి తాగుడు మాన్పించేందుకు, పెళ్లి పీటలమీద తన ప్రేమను సైతం వొదులుకొని, నెచ్చలి ఆమోదంతో నేటి యువతకు ఆదర్శమూర్తిగా, ఇరవైఏడు గ్రామాలలో మార్పుతెచ్చి, భారతప్రధాని ప్రశంస పొందుతాడు. ఇంత జరిగాక, తండ్రిలో పరివర్తన సహజం. చిరంజీవి నటనా కౌశలంలో యిదొక మహోన్నత శిఖరం. దర్శకత్వం : బాలచందర్.

# G D Birla International Award to BABA AMTE



On Jan. 22, 1988 a high level jury headed by Union Vice President Dr. Shankar Dayal Sharma met in Delhi and unanimously chose Baba Amte for the first G.D. Birla International award for outstanding contribution to humanism. The other members of the jury were Sri B K Nehru, Dr Karan Singh, Dr Raja Ramanna and Dr L M Singhvi. The award carrying a sum Rs. two lakhs to be presented biennially along with a citation has been instituted by the Birla Academy of Arts and Culture, in memory of G D Birla to foster creative efforts for enrichment of human spirit. The formal presentation will take place in Delhi at a public function on Sri Ram Navami Day, 26th March, 1988 which is also the 95th birth anniversary day of G. D. Birla

## ఆర్ జె ఆర్ వారి
## 'స్టేషన్ మాస్టరు'

చైతన్య (రాజశేఖర్) రామారావు (రాజేంద్ర ప్రసాద్) అనే యిద్దరు యువకులు బస్సు దిగి, కాలి నడకని ఊళ్లోకి వచ్చి, తమకు ఉద్యోగ మిస్తానని ధరావతు పుచ్చుకొన్న పెద్దమనషి. వొట్టి మోసగాడని దేవుడు గుళ్లోని పూజారి చెప్పగా తెలుసుకుంటారు. తలదాచుకునేందుకు రయిల్వే స్టేషన్ వెయిటింగ్ రూమ్ శ్రేష్ఠమైన ప్రదేశ మని అక్కడ మకాం పెడతారు. స్టేషన్ మాస్టరు (రావు గోపాలరావు) చాలా స్ట్రిక్ట్. నేర్పరులైన ఈ యువకు లిద్దరూ జాలికరమైన అబద్ధాలు చెబు తారు. తమకు పిల్లలు లేని కారణంగా నైన్‌డవున్‌నీ, ఫార్టీఫోర్ అప్ నీ (9 down - 44 up పెద్దోడు చిన్నో డుగా పిలుచుకొంటున్న ఈ స్టేషన్ మాస్టరు దంపతులు (భార్య: అన్నపూర్ణ) ఆ యువకులిద్దరికీ ఆశ్రయమిస్తారు. బంద్ కారణంగా రయిల్వే ట్రాలీమీద పక్కపట్నానికి పరీక్షలు వ్రాయడానికి తీసుకెళ్లిన యువతులిద్దరితో (జీవిత - అమల) వీరి పెళ్లిళ్ల జరిపిస్తారు. ఈ అబద్ధాల పట్టభద్రులు తమ కాపరాలు నానా బీభత్సం చేసుకోవడంతో, స్టేషన్ మాస్టరు ఆ బళ్లను ట్రాక్ మీదకి తీసుకువచ్చి, సుఖాంతం చేస్తాడు. రావు గోపాలరావు కోసం చూస్తారు ఈ చిత్రాన్ని మిగతాదంతా మామూలే. దర్శకత్వం: కోడి రామకృష్ణ. నిర్మాతలు: అంబరీష్, విజయ రామారావు.

## స్నేహ చిత్రావారి
## 'ఆలోచించండి'

నిరక్షరాస్యత, నిరుద్యోగం, గమ్యం లేని విద్యావిధానం, రిజర్వేషనులు - ఈనాలుగింటినీ గుచ్చెత్తి, పదిహేనూ పద్దెనిమిదేళ్ల మధ్య, కాంగ్రెస్ పాలన లో జరిగిన కథలా చూడమంటున్నారు దర్శకులు నారాయణమూర్తి. గోపీని (రవిశంకర్) తల్లిదండ్రులు బళ్లో వేస్తారు; బిఎ చెప్పిస్తారు; గోపీ తమ్ముడు మాత్రం 'అ ఆ' లు కూడా నేర్చుకోకుండా పొలం దున్నుకుంటూ వుంటాడు. ఒక పేద రైతు తన పొలం అమ్మి, పెద్ద కొడుకుని బిఎ చేశాడు; ఆ అబ్బాయికి ఫస్ట్‌క్లాసూ గోల్డ్ మెడలూ వచ్చాయి; అయినప్పటికీ ఈ సంఘం, ఈ ప్రభుత్వం రిజర్వేషనుల కారణంగా, అతనిని ఆదుకోలేకపోయాయనేది ఈ యితివృత్తంలోని ఫిర్యాదు. రాగింగ్ కారణంగా ఒకని మరణానికి కారకు డైన దుష్ట విద్యార్థి (సాయికుమార్), ఇన్‌విజిలేటర్‌ని ఎగ్జామ్స్ హాలులో పొడిచి జైలుకెళ్లిన దుష్ట విద్యార్థి, ఒక మంత్రిగారు తలుచుకున్నంత మాత్రాన యిట్టే యిన్‌స్పెక్టరవడం సాధ్యం కాదు. అలాగే నేల కూలిన గోపీ, మంత్రిగారి పీకె నులిమి చంపడం కూడా కృతకంగా ఉంది జీపి, ఏడువందల జీతగాడు వంటి వంగుపండు పాటలు చిత్రానికి జీవ మిస్తున్నాయి. హీరోగా రవిశంకర్

పక్కటి నటనా సామర్థ్యం చూపాడు. పిక్చర్‌లోని కథ యింకొంచెం బలంగా సహేతుకంగా ఉండాలి. దర్శక నిర్మాత: నారాయణమూర్తి.

### గోపీఆర్ట్స్ వారి 'దొంగరాముడు'

రామకృష్ణ (బాలకృష్ణ) తన ఎస్టేట్ వ్యవహారాలు చూసుకోవడానికి అమెరికా నుంచి వస్తున్నాడు. అతను రైలు దిగి గుర్రపుషార్టు ఎక్కగానే, ప్రమాదాల ప్రకరణ ప్రారంభమవుతుంది. ఆ బండి లోయలోకి దొర్లిపోగా గుర్రం మీదకి దూకుతాడు. శత్రువులని దునుమాడి ఎస్టేటు భవనం చేరుకొనే లోపలే, ఒక అన్నుల మిన్న తటస్థపడి, తేనె ఎంత రుచిగా ఉంటుందో తెలియచెబుతుంది. నవ సమాజ స్థాపనోద్ధారకుడైన రామకృష్ణకు, ఇంటా బయటా విరోధులే! సవతి తల్లి, ఆమె బ్రదరూ, గంజాయి వ్యాపారస్థుడైన లంకా ఈశ్వర్రావుతో (మోహన బాబు) చేతులు కలిపి, టీ హోట్లాల మధ్య మాదకద్రవ్యాల బట్వాడాకి పాల్పడతారు. గంగ (రాధ), ఆమె తండ్రీ పుచ్చుకున్న ఓ కారణంగా రామకృష్ణకు రహస్యం తెలిసిపోతుంది. బాహాటంగా తిరగబడే సమయం కాదని, రామకృష్ణ చనిపోయినట్టుగా నాటక మాడి, దొంగరామునిగా దర్శన మిస్తాడు హీరో. 'సై అన్న వాణ్ణి సర్కస్ ఆడించడం నాకు ఉగ్గుపాలతో వచ్చిన విద్యరా' అని తన ప్రతాపం చెబుతూ, 'జాలీగా వున్నావే జాకెట్‌లో- వాటంగా వున్నావే వోణిలో' అని కథానాయికను కవ్వించే బాలకృష్ణ, తన నటనా ప్రాభవంతో ప్రేక్షకులని



మెప్పిస్తాడు. దర్శకత్వం: రాఘ వేంద్రరావు; నిర్మాత: చలసాని గోపి.

## గోపీకృష్ణ వారి 'మా ఇంటి మహరాజు'

మాధవయ్య (కృష్ణంరాజు) తాము వుంటున్న యిల్లు ఖాళీచేయవలసి వస్తుంది. అయితే యజమాని (నూతన ప్రసాద్) నేర్పుగా మరొక యిల్లు చూపించడమే గాక, వాయిదాల పద్ధతిలో చెల్లించేటట్లు లారీని ధారా దత్తం చేస్తాడు. ఇద్దరబ్బాయిలూ ఒక అమ్మాయీ గల ఈ మాధవయ్య పది హేనేళ్లలో బాగా పుంజుకున్నప్పటికీ ఎదిగిన పిల్లలిద్దరికీ చెరో సైకిలూ తనో నరి పెట్టుకుంటారు. ఒక బ్బాయికి మేస్టారుగారి కూతురితోను, మరొకబ్బాయికి యాజమాని కూతురు తోను పెళ్లిళ్లవుతాయి. మాధవయ్య కూతురు (పూర్ణిమ) విలన్ కొడుకుని (శుభలేఖ సుధాకర్) ప్రేమిస్తుంది. ఆ అబ్బాయి గొప్ప మనసు తెలుసుకొని మాధవయ్యే పెళ్లి జరిపించగా, విలన్ ఈ మాధవయ్య మీద కత్తి కడతాడు. అయితే, విలన్ ప్రమేయమేమీ లేకుండానే, కోడళ్లిద్దరూ తమ భర్త లతో వేరెళ్తారు. చివరికి మాధవయ్య సినీహీరోయిజమ్ వల్ల పరిస్థితులు చక్క బడతాయి. కృష్ణంరాజు జయసుధల నటనాకౌశలం తప్పితే, ఈ చిత్రకథలో జీవస్పందనలేదు. సంభాషణలో చెణ కులే తప్పి పాత్రోచిత న్యాయం లేదు. విలన్ చేసే ఘాతుకాలకి కారణం కనబడదు. కృష్ణంరాజు నొక ఆదర్శ వాదిగాను, జయసుధ నొక ఉత్తమ ఇల్లాలుగాను చూపారు - అంతవరకే బావుంది..... దర్శకత్వం; విజయ బాపినీడు.

## ఎరీస్ వారి 'ఒకే ఒక గ్రామంలో' (తమిళం)

కరుప్పాయి (లక్ష్మి), శంకరశాస్త్రి (పూర్ణం విశ్వనాథమ్), ఆంటొని (వినూ చక్రవర్తి) - ఈ ముగ్గురి మధ్యా జరిగే ఒక అద్వితీయ నాటక మిది. దైవంశికి (మనోరమ) అసలు కథేమిటో తెలీదు: బ్రాహ్మణ కులంలో పుట్టిన తన కూతురు గాయత్రికి - తల్లి లేని పిల్ల, ఒక్కర్తే కూతురు, మగ పిల్లలు లేరు - కాలేజీ సీటు దొరకడం దుర్లభమని తెలిసిన శంకరశాస్త్రి, తాసి ల్దార్ దేవసహాయం (చారుహాసన్) వద్దకు వెళ్తాడు. దేవసహాయం యింత వాడవటానికి శంకరశాస్త్రి తండ్రే కారణం. ప్రత్యుపకారం చేయాలనే కృతజ్ఞతా చింతనతో, ప్రభువు మన్నింపు కోరుతూ, గాయత్రి పేరు కరుప్పాయిగా మార్చి, అది ద్రావిడ అనే సర్టిఫికెట్ యిస్తాడు. పధ్నాలుగేళ్ల వయసున్న ఆంటోనీ అప్పట్లో తాసి ల్దారు గారింట్లో నౌకరు..... కరు ప్పాయి ఉన్నత విద్య నభ్యసిస్తుంది; పెద్ద ఉద్యోగం వస్తుంది; అదే ప్రాంతానికి వస్తుంది ఢిల్లీ నుంచి! తన తండ్రే తన వద్ద బి డి ఓ.... ఈమెని బెదిరించి డబ్బు గుంజుతూ

వుంటాడు తాగుబోతైన ఆంటోని. పరిస్థితులు విషమించాక ఆ ఆంటోని, పై అధికారులకి ఒక ఉత్తరం రాసి, మైకంలో మరణిస్తాడు..... కరుప్పాయినీ, శంకరశాస్త్రినీ ప్రభుత్వం సస్పెండ్ చేస్తుంది. విద్యాసంపన్నురాలైన కరుప్పాయి, తన కేసు తనే వాదించుకుంటుంది కోర్టులో! ఆమె ఆర్గుమెంట్స్ జడ్జీగారిని వుక్కిరి బిక్కిరి చేస్తాయి. నాచురల్ జస్టిస్‌కి వ్యతిరేకమైన శాసనాలు జారీ చేయగల అధికారం ప్రభుత్వానికి సైతం లేదంటుంది గాయత్రి (కరుప్పాయి).... రిజర్వేషనుల పేరిట జాతిని నిర్వీర్యం చేసే హక్కు శాసన నిర్మాతలకు లేదంటుంది.... లక్ష్మి పెర్‌ఫారమెన్స్ చాలా గొప్పగా ఉంది. యువ దర్శకుడైన జోతీ పాండియన్‌కి యిది రెండవ చిత్రమట. అన్ని భాషలలోకి డబ్ చేసి యావద్భారతంలోను చూపదగు చిత్రమిది. ఇళయరాజా సంగీతం. నిర్మాత: యస్ రంగరాజన్ ('హిందూ' పబ్లిషర్)

## జెయస్‌కె వారి 'కాంచన సీత'

అడ్వకేట్ రామారావు (శరత్ బాబు), ఒకానొక దాంపత్య కలహంలో భార్య తరపున వకాల్తాపుచ్చుకొని, ఆమె కేసు నెగ్గించిన కారణంగా, ఆమె భర్త కక్ష బూని, రామారావు భార్య జానకిని (జయసుధ) కొన్నాళ్లపాటు వెంబడించి, ఆ తర్వాత అదను చూసుకొని చెరబెట్టి, ఆమెని అవమానించకుండా, లోకం అనుమానించేటటు చేస్తాడు - రావణుని అశోకవనంలో ఉన్న సీతను ఒక రజకుడు తప్పుబట్టినట్లు! గర్భవతి అయిన జానకిని, తండ్రిగారి ఆశ్రమంలో దింపి రావలసినదిగా ఆజ్ఞాపిస్తాడు రామారావు తన తమ్ముడు శేషుని (రఘువరన్). 'ఇదే చివరిసారిగా నీమాట వినడం' అని అన్నగారికి అల్టిమేటుమ్ యిచ్చిన శేషు, అనాడు రథమైతే, ఈనాడు ఫియట్‌లో వదినగారిని ఆమె తండ్రి వద్ద దింపి వస్తాడు. ఆ తర్వాత ఈ జానకి తన భర్త నుంచి విడాకులు పొందుతుంది. తండ్రి చనిపోగా, నిరాశ్రయురాలై బొట్టు చెరుపుకు వితంతువిని అని చెప్పి, అనాథాశ్రమంలో చేరుతుంది; ఉత్తరోత్రా దానికి సెక్రటరీ అవుతుంది. ఇరవైఏళ్లు గడిచాక, అతను జడ్జీ; తన కొడుకుని చంపిన నేరస్తురాలిగా బోనులో ఆమె. ఆ పుణ్యవతి అటువంటి దారుణానికి వొడిగట్టిన పరిస్థితులు అవలోకించమని మరిది శేషు (అతనూ అడ్వకేటే) ఉత్తరరామ చరితను అసందర్భంగా సోషలైజ్ చేశారు: ప్రేక్షకులని కరుణరసార్ణవంలో ముంచుతుంది జయసుధ. దర్శకులు: దాసరి నారాయణరావు. నిర్మాత: నితిన్ కపూర్.



తన వ్యక్తిత్వాన్ని కోల్పోయినవానికి మిగిలేదేమీ వుండదు. నియమావళి లేనిదే ఏ కార్యమూ నిర్వహించలేము.

— గాంధీజీ

సీరియల్

# ప్రతి గురువారం'

భార్యా భర్తలు ఒక చిన్న ఊళ్లో 'ఆర్కైవ్' అనే వారపత్రిక నడుపుతున్నారు. తమ సాధక బాధకాలు చెబుతోంది రచయిత్రి జేన్ మెక్లవిన్.

— ఇక చదవండి

డవునింగ్ టవున్‌లో మూడు చిన్న బైండింగ్ షాపులు వున్నాయి. ఆ మూడూ జూదశాలలని ఊళ్ళో వాళ్ళందరికీ తెలుసు. పోలీసువారికీ తెలుసు. కాని, ఆ జూదపుకొట్లు నిర్వహించే ధనవంతుడికి భయపడి, ఎవరూ కల్పించుకునేందుకు ధయిర్యం చెయ్యలేదు.

హామిల్టన్ అను ఒక సంఘ సంస్కారి చెవిని పడింది - ఆ జూదపు కొట్లలోకి హైస్కూలు పిల్లలు కూడా వెళ్తున్నారని. పురపాలక విషయాలు, ప్రభుత్వ విషయాలు, సమాజ విషయాలు – యిలాటి వాటికోసం తన తీరిక సమయం వినియోగించేవాడు ఆ హామిల్టన్. స్థానికాధికారులూ, పోలీసులూ ఆ జూదపుకొట్లు మూసేయించడానికి అశక్తులని తెలుసుకొని పై అధికారుల దగ్గరికి వెళ్లాడు హామిల్టన్. స్టేట్ సిబ్బంది సాయంతో, వెనుకటి పోలీసు యినస్పెక్టరు ఆధ్వర్యాన దాడి జరిగింది. పోలీసు యినస్పెక్టరు చాలా గుట్టుగా ప్రవర్తించి, పైవారి మన్ననలకి పాత్రుడయాడు.

బాబ్ ఈ కథని పుట్టుపూర్వోత్తరాలతో అచ్చు వేయగానే, పోలీసు యినస్పెక్టరు మొహం వికసించింది. స్వయంగా వచ్చి, మమ్మల్ని అభినందించి వెళ్ళాడు. ఇన్నాళ్ళూ మమ్మల్ని "రెడ్స్" కింద జమకట్టిన కొందరు ఆ దురభిప్రాయం మార్చుకున్నారు. ఏమయితేనేం, కొందరు మమ్మలి మంచివాళ్ళు అం టూ ం టే, మరి కొందరు మమ్మల్ని చెడ్డవాళ్ళు అనేవారు. అది మాకు అలవాటై పోయింది.

వ్యక్తిగత విద్వేషాలకి సంబంధించిన వార్తలు పట్టుకొచ్చి, అవి మమ్మల్ని వెయ్యమనేవారు. మా కొలబద్ద ఒక్కటే: సాంఘిక ప్రయోజనంలేని సమస్తం, చెత్తుబుట్టకే అంకితం.

రకరకాల స్వభావాలూ, రకరకాల సమస్యలూ తెలుసుకోవడం మనకి ఉత్తేజాన్ని యిస్తుంది. అంతర్ దృష్టితో మనోవైశాల్యం పెరుగుతుంది. మనోవైశాల్యం పెరిగినకొద్దీ ఈ లోకంలో ఏ ఒక్కటీ చీకాకనిపించదు. అప్పుడే మనం నిజంగా జీవిస్తాం. ప్రతిదీ

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతుక నేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం, ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

---

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

క్వాలిటీ పబ్లిషర్స్
రామమందిరం వీధి – విజయవాడ-2

తొణికిసలాడుతుంది. మన కోర్కెలూ, మన ఆశలూ, ఒక్కొక్కప్పుడు, మనం అనుకో[illegible] విధంగా, ఆశ్చర్య కరమైన [illegible] నిస్తాయి. ఒక పట్నం లోని ప్రజాజీవితానికి సంబంధించిన సమస్యలని పరిశీలించడమంటే, పైపై విషయాలతో ఆగం - 'అసలు విష యాలు' - దగ్గిరకెళ్లి వాటిని తెరిచి చూస్తాం. ఆ 'అసలు విషయాలే' మానవ స్వభావాన్ని నడిపించేది

## 13

1947 ఫిబ్రవరిలో ఒకరోజు ఉదయం పెద్ద అగ్ని ప్రమాదం జరిగింది. ఊరికి రెండుమైళ్ళదూరంలో వున్న నీగ్రో స్కూలు తగలబడి పోయింది. డవునింగ్ టవున్ యిండస్ట్రి యల్ అండ్ యగ్రికల్చరల్ స్కూలు అనబడే ఈ నీగ్రో పాఠశాలని, 1905 లో కొందరు సంఘసేవా తత్పరులు, నీగ్రో పిల్లల కోసమని స్థాపించారు. నేరాలూ, రంగుజాతుల కలహాలూ, ఆర్థిక బాధలూ - వీటికి దూరంగా వుంటూ నీగ్రో యువకులు విద్యా బుద్ధులు నేర్చుకునేందుకుగాను ఈ స్కూలు ప్రారంభింపబడింది.

ప్రిన్సిపాల్ జేమ్స్ వేరింగ్, ఆయన భార్య ఈస్కూలుకోసం ఎన్నో సంవత్స రాల బట్టి కృషి చేస్తున్నారు. పిల్లల హాస్టలూ, స్కూలు భవనమూ, టీవర్ల వస్తువులూ అన్నీ మంటలకి ఆహుతి అయిపోయాయి. ప్రిన్సిపాల్ దంప తులు యిన్నేళ్లబట్టీ చేస్తున్న కృషి, ఆ ఉదయంతో, బూడిద పాలయింది. ఇంక స్కూలు కట్టెయ్యడం మినహా మార్గాంతరం లేదనిపించింది.

అప్పుడు దైవికంగా ఒక సంఘటన జరిగింది. మానవులు స్వతహాగా మంచి వాళ్ళే అన్న నమ్మకాన్ని దృఢతరం చేసేందుకా అన్నట్టు, దయాసముద్రు లైన ప్రజలు ధారావాహికంగా సహాయం చేయడం మొదలెట్టారు ఆ స్కూలుకి. ఆనాటి అగ్నిప్రమాదం, ఈ యాభై యేళ్ళ బట్టీ వున్న రంగు విభేదాలని, యిట్టే పోగొట్టింది. బట్టలేమిటి, భోజన పదార్థాలేమిటి, పుస్తకాలేమిటి - కుప్ప తిప్పలుగావచ్చి పడ్డాయి. నీగ్రోపిల్లలు తమ గడప దొక్కడానికి వీల్లేదన్న వాళ్ళు, "అయ్యో, పాపం" అను కుంటూ వారిని తమదగ్గిర కొన్నాళ్ల పాటు అట్టే బెట్టుకునేందుకు, తమం తట తామే ముందుకి వచ్చారు. ఎన్ని సంవత్సరాల బట్టో ప్రిన్సిపాల్ దంపతులు సాధించ లేకపోయిన కార్యాన్ని, ఈ విపత్తు అరగంటలో చేసిపెట్టింది. స్కూలుకి సహాయం చేసేందుకు వెంటనే ఒక కమిటీ ఏర్పాటయింది. బిల్డింగ్ ఫండు పోగు చేయవలసిన ఆవశ్యకత గురించి ఆర్కయివ్‌లోనూ, సాటర్ డే ఈవి నింగు పోస్టులోనూ వ్యాసాలూ వచ్చాయి. ఆ కమిటీ, ఈ వ్యాసాలూ సాధించిన దేమిటంటారా ? ఆ స్కూలు చరిత్రలో కనివిని యెరగ నంతటి సొమ్ముని - ఒక లక్షయాభైవేల డాలర్లని, ప్రభుత్వం, స్కూలు భవన పునర్నిర్మాణానికి గాను గ్రాంటుగా ఇచ్చింది.

పత్రికకి ఎప్పుడూ ప్రజాబలం వెనకనుండాలి. మేము ప్రచురించే వార్తల్లో నూటికి తొంభయి తొమ్మిది వంతులు సర్వసామాన్యమైనవే: నిత్యకృత్యంలో జరిగేవే! కాని, ఆ సర్వసామాన్య విషయాల చుట్టూ ప్రజాజీవితం పరుగులెడుతూంటుంది. ఆ సామాన్య విషయాల కేంద్ర స్థానమే ప్రజ. మాకు కావలసింది ఆ ప్రజా, ఆ ప్రజాబలమూ. అది మర్చిపోయి మేము నిరుత్సాహపడితే, మా పత్రికా ధర్మాన్ని సరిగ్గా నిర్వర్తించ లేక పోయామన్న మాటేగా!



రాజాలక్ష్మి ఫౌండేషన్ వ్యవస్థాపకులు రమణయ్య రాజాకు 1987 నవంబరు 19వ తేదీతో అరవై వసంతాలు. రాజాలక్ష్మి అవార్డ్ ప్రదానోత్సవం, షష్ట్యబ్ది వేడుక రాణిసీతయ్ హాలులో జరిగాయి.

## 14

పత్రిక గురించి మేము కనిన కలల్లో మా త్రివర్ణ స్వప్నంలో, యకవుంట్ పుస్తకాలు, బిల్లు పుస్తకాలు, జమా ఖర్చుల పట్టిక మొదలైనవి లేవు.

1947 జూన్‌లో విశ్రాంతి కోసమని బాబ్ దూర ప్రదేశానికి వెళ్లినప్పుడు, చక్కని సూటులోవున్న పొడుగాటి యువకుడు తిన్నగా ఆఫీసులోకి వచ్చి, తను ఆడిట్‌కోసం వచ్చానన్నాడు. అదేమిటో నాకు అర్థంగాక పోయినా, తెలియనట్లు కనిపిస్తే బావుండదని - "అలాగా" అన్నాను. తెలివి తక్కువ తనం బయట పడనియ్యవచ్చా?

కాని లాభంలేక పోయింది. చిట్ట చివరికి వొప్పుకోక తప్పిందికాదు. ఆడిట్ విషయం నాకేమీ తెలియదనీ, బాబ్ వచ్చాక అతన్ని అడగాలనీ, నన్నడిగి ప్రయోజనం లేదనీ అన్నాను.

"మీభర్త గారు ఎబిసి సభ్యత్వానికి గాను దరఖాస్తు పంపించారు. మీ

 

కేమంత సర్క్యులేషన్ వున్నట్టు తోచదు. దరఖాస్తు ఎందుకు పంపించారో గానీ!" అన్నాడు ఆ యువకుడు, ఎలక్ట్రిక్ దీపం నుంచి కప్పుదాకా వున్న సాలిగూళ్లవంక ఒక్కసారి చూస్తూ.

"నిజం చెప్పొద్దూ - ఎబిసి పేరు నేను ఇంతదాకా వినలేదు. అదేదో యడ్వర్టయిజ్‌మెంటులు యిచ్చే సంస్థ అనుకుంటాను. యడ్వర్టయిజ్ మెంటులు యిచ్చేందుకయితే, నామాట నమ్మవచ్చు. మా పత్రికకి వున్నంత ప్రచారం ఈ చుట్టుపట్ల ఏ పత్రికకీ లేదు" అన్నాను.

# ముఖచిత్రం

1934 లో హజారీబాగ్ జైలు నుంచి విడుదలయాక, బాద్షాఖాన్‌కి తన యింటికి వెళ్లగల అవకాశం లేక పోయింది. సరిహద్దు రాష్ట్రానికిగాని, పంజాబ్‌కి గాని వెళ్లడానికి వీల్లేదని ఆంక్ష విధించింది ఆనాటి బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం. ఆ రెండూ తప్ప దేశంలో మిగతా ఏ ప్రాంతానికైనా వెళ్ల వచ్చునన్నారు. వార్తా వచ్చి, తనతో సేవాగ్రామ్‌లో ఉండమని ఆహ్వానించారు బాపూజీ. బాద్షాఖాన్ కొన్నాళ్ల పాటు సేవాగ్రామ్‌లో ఉండి ఆశ్రమ నియమావళికి బద్ధులై నడుచుకుం టూన్న రోజులలో ఒక సాయింత్రం వాహ్యాళికెళ్తున్నప్పుడు గాంధీజీ అన్నా రట: 'ఆలీ సోదరులను నేను హృదయ పూర్వకంగా అభిమానించాను - కాని, వారు నానుంచి విడిపోయారు.- మరి మీ విషయమేమవుతుందో' .... "బాపూజీ, మనిద్దరమూ అహింసలోనే ప్రేమవున్నదనీ, ప్రజాసేవలోనే దేవుడు న్నాడనీ నమ్ముతున్నాము కాబట్టి, మనకి విడిపోవడమంటూ వుండదు - ఇద్దరిదీ ఒకేమాట, ఒకేబాట" - అన్నారు బాద్షాఖాన్ (ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్) .... ఆయన బాపూజీని మొదటిసారిగా చూసినది 1920లో ఢిల్లీలో ఖిలాఫత్ ఉద్యమ సభలో, అదే సంవత్సరం మళ్లీ కలకత్తాలో కలుసుకున్నారు .... మెట్రిక్ పరీక్ష పూర్తి గాకుండానే గఫార్ ఖాన్ బ్రిటిష్ ఇండియా ఆర్మీలో చాయినయాడు. అయితే, ఆ పద్ధతులూ అవీ నచ్చక, ఉద్యోగం విరమించుకు, 'ఖుదాయ్ ఖిద్మత్ గార్' అనే ప్రజా హిత సంస్థను ప్రారంభించాడు. దశ సూత్రావళికి లోబడ్డవారే యిందులో సభ్యత్వానికి అర్హులు. ఇతరులకు కష్టం కలిగించకుండా వుండటం, దుష్ప్రచారం చేయకుండా వుండటం, సాత్త్వికమార్గం, స్వాధికార నిరోధం, ముఠాతత్వానికి దూరంగా వుండటం, అనాచార నిర్మూలన, నిరాడంబర జీవనం, నిజాయితీతో జీవయాత్ర, సేవానురక్తి, సంఘవిధేయత.... చెప్పుకునేందుకు సామాన్యంగా వున్నప్పటికీ, ఆచరణలో అవి పర్వతారోహణవంటివి...పశ్చిమోత్తరరాష్ట్రంలో బాద్షాఖాన్ మకుటం లేని మహారాజు - సరిహద్దు గాంధీగా పక్తూన్ ప్రజల హృదయాధినేత.... ఈ ఉపఖండ విభజన జరుగుతుందని ఆయన కలలో కూడా అనుకోలేదు - గాంధీగారూ అనుకోలేదు తన మాట ఖాతరు చేయరని! కాని చరిత్ర మరోవిధంగా నడిచింది.... ఆఫ్ఘన్ నేలలో నిదురిస్తున్న భారతరత్న ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్, మన స్వాతంత్రోద్యమ మహానాయకులలో మేరునగధీరుడు.

అహంవల్ల ఏర్పడే అంధకారం, అసలు చీకటికంటె కడుదట్టమైనది.

—గాంధీజీ

ఆ యువకుడు తలపంకించి, కళ్లు తిప్పి, ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు.

అతను తిన్నగా న్యూయార్కునుంచి వచ్చాడట. ఈ పనికోసమనే, ఇంత ఎండాకాలంలో, అంత దూరం నుంచి వచ్చాడట. "మళ్లీ మరొకసారి రావడం ఎక్కడ కుదురుతుంది?" - అన్నాడు. ఎబిసి వారు ఏ పత్రిక ఎన్ని కాపీలు అమ్ముతుందో, నిజమైన లెఖ్ఖలు చూసి, సర్టిఫికేటు యిస్తారు. ఆ సర్టిఫికేటు పత్రిక పాలిట శ్రీరామరక్ష.

"మీ సర్క్యులేషన్ కార్డులు చూడనివ్వండి" అన్నాడతను.

చందాదారుల కార్డులు నాలుగైదు అతని చేతికిచ్చి - మా భార్యా భర్తల మిద్దరం రాత్రింబవళ్లూ కష్టపడుతూ, ఈపత్రికని నిలబెడుతున్నాం - అన్నాను. కష్టం ఎక్కువై, ఆరోగ్యం చెడటంవల్ల, విశ్రాంతి తీసుకునేందుకు బాబ్ వెళ్లాడని కూడా చెప్పాను.

చందాదారుల కార్డులవంక చూసి, అతనువిచారంగా మూలిగాడు. సంపాదకీయం తొందరగా పూర్తి చేయాలనే ఆందోళనలో నేను వున్నాను.

"ఇటు చూడండి" అన్నాడు ఆ ఆడిటర్.

కార్డువంక చూశాను. కార్డుకి ఎడమ తలకట్టు వైపున పేరూ, యడ్రసూ, తేదీ ఉన్నాయి. తేదీ అంటే ఏనాటితో చందా అయిపోతుందో ఆ తేదీ. అందులో పొరపాటుఏమీనాకుకనపడలేదు.

"కార్డుమీద ఆ పెన్సిల్ మార్కులేమిటి?" అన్నాడు.

## నేషనల్ సిటిజన్ వి.కె. శాస్త్రి

కరుణామూర్తి మదర్ థెరిసా, 'గోల్డెన్ గేట్' విక్రమ్ సేథ్, జస్టిస్ భగవతి, సోషల్ వర్కర్ సునీల్‌దత్, ప్లానింగ్‌కమిషన్ మన్‌మోహన్‌సింగ్, 'తమస్' గోవింద్ నిహ్లానీ మున్నగు వారితో మా టి వి కె శాస్త్రి - మద్రాసు తెలుగు అకాడమీ, భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీల ప్రధాన కన్వీనరు - నేషనల్ సిటిజన్స్ అవార్డు అందుకుంటున్నారంటే, మా కెంత సంతోషంగా ఉందో చెప్పలేము. ఇరవైయొక్క మంది ఈ అవార్డ్ అందుకుంటున్నారు. పైన పేర్కొన్న ఆరున్నొక్కరూ గాక మిగతా పధ్నాలుగురు: దివంగతులైన స్మితాపాటిల్, ఆర్టిస్టు సలీమ్ ఆలీ; ఆ తర్వాత, ప్లానింగ్ కమీషన్ మెంబరు ఆబిద్ హుస్సేన్; పార్లమెంటేరియన్ నారాయణ్ చంద్ పరాశర్; చెస్ ఛాంపియన్ ఆనంద్; పోర్ట్ అథారిటీ చైర్మన్ యన్ కె సింగ్; భారత్ హెవీ ఎలక్ట్రికల్స్; పోలీసు కమీషనర్ వేద్ మార్వా; అభయ్ ఓస్వాల్; హోమియోపత్ దివాన్ హరీష్ చంద్; జర్నలిస్ట్ భట్టాచార్య; మాలిక్యులర్ బయాలజిస్ట్ భార్గవ; ఫిజిక్స్ ప్రొఫెసరు యస్పి జైన్; సంగీత దర్శకుడు భూపేన్ హజారికా.... న్యూఢిల్లీలోని నేషనల్ సిటిజన్స్ కమిటీకి అధ్యక్షులు ఆదిష్ అగర్వాలా.

ప్రతి కార్డుమీద పెన్సలుతో రాసిన మాట నిజమే. మాకు ఆ పెన్సిల్ అక్షరాలు స్పష్టంగా అర్థమవుతున్నాయి. కాని మా ఆడిటర్‌కవి తేళ్లూ జెర్రులూలా వున్నాయి.

"ఆయన యిచ్చేశాడు."

"బాబ్‌కి బాంక్ మూల యిచ్చానన్నాడు."

"తర్వాత పంపుతానన్నాడు."

"హైస్కూలుకి ఇస్తానన్నాడు."

"జేన్‌కి స్టోర్ దగ్గిర యిచ్చానన్నాడు."

"జీతం రోజున యిస్తాడట."

"రెండుసార్లు అందింది."

ఆ ప్రకారం రాసివున్నాయి.

"ఈ రహస్య భావాల అర్థం మీకు తెలియాలిగాని నాకు తెలియదు. అదీగాక, అలాటివి తెలుసుకోవడం నాపని కాదు. ఎబిసి మనిషికి కావలసిందేమిటంటే, - ఈ చందాలు ఎప్పుడు అందాయి? - అవి అందినట్టు రుజువు వేసేందుకు బాంకు చలానా ఎక్కడ? లేని పక్షంలో, వాటిని నిజమైన చందాలుగా ఆమోదించలేం" అన్నాడా ఆడిట్ మనిషి.

ప్రతివారం పేపరు బయటపడేందుకే పతమతమవుతున్నామనీ, ఆ కారణంగా మేము అకవుంట్లు సరిగా వుంచలేక పోయామనీ, మేము వీధిలోకి వెళ్లినప్పుడు "ఇదిగో, పోయిన వారం ప్రకటనతాలుకు పైకం" అనీ, "ఇదిగో, నేను బాకీపడ్డ చందాపైకం" అనీ అంటూ మనుషులు మాకు డబ్బు యిస్తూ వుంటారనీ, ఆ పైకం జేబులో పడేసుకు, ఆఫీసుకొచ్చేదాకా మాత్రం అది ఎవరిచ్చారో జ్ఞాపకం వుంచుకునే వాళ్ళమనీ, అతన్ని సావధానపరుస్తూ చెప్పాను.

నేనింకా చెబుతూండగానే "చందా పుచ్చుకునే స్థలం యిదేనా?" అని బిగ్గరగా అరుస్తూ, ఒక ఆడమనిషి లోపలికి వచ్చింది.

ఇదేనని ఆమెకి నచ్చజెప్పి, ఆమె యిచ్చిన పైకం పుచ్చుకున్నాను. ఎబిసి మనిషివంక చూస్తూ, "దీనిని ఏమి చేయాలో, దయచేసి, చెబుదురూ?" అన్నాను ప్రాదేయ పూర్వకంగా.

నుదిటి మీద స్వేదబిందువులు తుడుచుకుంటూ, మధ్య మధ్య గుక్కెడు మంచినీళ్ళు తాగుతూ, ఎబిసి మనిషి ఆ పూట మా అకవుంట్ పుస్తకాలు వరుసగా పరీక్షించాడు. అకవుంట్ అనేది సులువుగా ఎలా రాయాలో విడమరిచి చెబుతూ, ఈ అకవుంట్లు క్రమపద్ధతిలోకి తీసుకు వచ్చే విధానం కూడా చెప్పాడు. అకవుంట్లు విషయంలో అతను మాకు చేసిన సాయం యింతా అంతా కాదు.

ఆ తర్వాత అతను, ఎన్నోసార్లు మా ఆఫీసుకు వచ్చి, లెక్కలు పరిశీలించాడు. ఒక ఏడాది గడిచాక మేమూ ఎబిసి మెంబర్లమయ్యాం. ఆర్క్యయివ్ ఎబిసి మెంబరయిందని విన్నవాడు. మేము ఎంత సంతోషపడ్డామో చెప్పలేను. ఎబిసి సభ్యత్వమే గౌరవచిహ్నం. (ఇంకా వుంది)

# కాంచనసీత

A

నితిన్ కపూర్

సత్యమూర్తి-సత్యం-పి.యల్.రాయ్-కృష్ణంరాజు-బి.చలం-రవికుమార్

JAGATI Telugu Monthly - Vol. 33 - No. 382 - May 88
Edited, Printed and Published by N. R. Chendur at
MANASA PRESS, 2 Kutchery Road, Madras- 600
Phone. 76697